విగ్రహారాధనము

వేదాంతగ్రంథమాల

# విషయసూచిక.


| | | |
|---|---|---|
| (1) | ఈశ్వరైక్యము | పుట 1 |
| (2) | మాహాత్మ్యము | 5 |
| (3) | సఫలభక్తిము | 7 |
| (4) | తాదాత్మ్యభావన | 12 |
| (5) | ద్వివిధబ్రహ్మము | 16 |
| (6) | అసత్యమునుండి సత్యము | 26 |
| (7) | ప్రతిబింబప్రాముఖ్యము | 31 |
| (8) | సంయమస్థానములు | 40 |
| (9) | అల్పబుద్ధులు | 48 |
| (10) | నివేదన | 57 |
| (11) | అనుగ్రహహేతుత్వము | 63 |
| (12) | ఈశ్వరసాదృశ్యము | 68 |
| (13) | పదార్థస్వత్వము | 73 |
| (14) | ఇంద్రియ సంతర్పణము | 79 |
| (15) | ఏకాగ్రత | 85 |
| (16) | ప్రతీకమే బ్రహ్మము | 91 |
| (17) | విగ్రహవిభజనము | 98 |
| (18) | విశ్వరూపము | 102 |
| (19) | అవతారములు | 112 |
| (20) | గ్రామాదిదేవత్వము | 116 |
| (21) | అజ్ఞాత్వాద్యభినయము | 121 |
| (22) | త్రిమూర్తులు | 129 |
| (23) | రుచిభేదము | 133 |

# ఉపోద్ఘాతము

## ఈశ్వరైక్యము

సనాతన మతమును ద్వేషభావముతోఁ గొందఱు జూచుటకును గ్రొత్త మతంబుల స్థాపించుటకును గారణములుగాఁ జెప్పఁబడుచున్న వానిలో, సనాతన మతప్రకార మీశ్వరు లనేకులు కలరన్న పిచ్చి నమ్మక మొకటియై యున్నది. హిందూమత గ్రంథముల నిష్పక్షపాత బుద్ధితోఁ బరిశీలించిన పక్షమున నీశ్వరతత్త్వ మొక్కటియే యున్నదని భాసింపక పోదు. మిక్కిలి ప్రాచీనమైనదిగా నంగీకరింపఁ బడిన ఋగ్వేదమునందిట్లున్నది—

"ఇంద్రం మిత్రం వరుణమగ్నిమాహురథో దివ్యః స సుపర్ణో గరుత్మాన్ । ఏకం సద్విప్రా బహుధా వదన్త్యగ్నిం యమం మాతరిశ్వానమాహుః॥"

(ఇంద్రుఁడని, మిత్రుఁడని, వరుణుఁడని, అగ్ని యనియుఁ జెప్పుదురు; మఱియు నాతఁడు మంచి రెక్కలుగల ప్రకాశించు గరుత్మంతుఁడు. ఒక్కనినే విప్రులు పెక్కుభంగులఁ బల్కుదురు. ఎట్లన, అగ్ని యనియు, యముఁడనియు, మాతరిశ్వుఁడనియుఁ జెప్పుదురు)

మరియు, మనుస్మృతియందు,

"ఆత్మైవ దేవతాః సర్వాః సర్వమాత్మన్యవస్థితం"

(సమస్త దేవతలున్నూ ఆత్మయే అయియున్నారు; సర్వమూ ఆత్మయందే నిలచియున్నది)

అని చెప్పబడినది. మనుస్మృతియందే మరియొక చోట,

"ఏతమేకే వదన్త్యగ్నిం మనుమన్యే ప్రజాపతిమ్ ।
ఇన్ద్రమేకే పరే ప్రాణమపరే బ్రహ్మ శాశ్వతమ్"

(వానిఁ గొందఱగ్నియని నుడువుదురు; మఱి కొందఱు మనువని, ప్రజాపతియని, యటులనే కొందఱింద్రుడని, మఱికొందఱు ప్రాణమని, కొందఱు శాశ్వతంబైన పరబ్రహ్మమనియుఁ జెప్పుదురు)

అని వచింపఁబడినది. కాఁబట్టి యనంతములైన శ్రుతిస్మృతి ప్రమాణములవలన భగవంతుఁడొక్కఁడే భిన్నవ్యాపారములను భిన్నములైన పేరులఁ దాల్చి లీలగా నిర్వర్తించుచుండుటఁబట్టి నామభేదములు గలిగియున్నవని తేలుచున్నదికదా. కొందఱు భగవద్గీతలవల్ల నింద్రాదిదేవతలకును [illegible] వస్తుత

భేదమున్నదని చెప్పుదురు. అది సరికాదు. ఏల యన, భగవద్గీతలలోని తొమ్మిదవయధ్యాయము యొక్క 23, 24 శ్లోకములందుఁ బరమాత్మకును దేవతాదులకును వస్తుభేదము లేదని చెప్పఁబడినది. అందు 23 శ్లోకము నిచ్చుచున్నాఁడను—

“యేప్యన్యదేవతాభక్తా యజంతే శ్రద్ధయాన్వితాః।
తేపి మామేవ కౌంతేయ యజంత్యవిధిపూర్వకం॥”

(ఓయర్జునుఁడా! ఏజనులితర దేవతాభక్తులైన వారలై శ్రద్ధతో కూడినవారై పూజించుచున్నారో యాజనులు తెలియకుండ నన్నే పూజించుచున్నవారు)

శ్లోకములోని ‘మామేవ’ అను దానిని గుర్తింపుఁడు. కాఁబట్టి యింద్రాది దేవతలఁ బూజించువారు తద్దేవతలకంటెఁ బరమేశ్వరుఁడు భిన్నుఁడై యున్నాఁడని భ్రమపడుచున్నను వాస్తవముగా నా పరమేశ్వరునే పూజించుచున్నారని శ్లోకతాత్పర్యము.

శ్రీకృష్ణభగవాను లీవిధముగా గీతల యందానతిచ్చి యున్నారు—

‘యోయోయాం యాంతనుంభక్త,’

అంతియగాని, తద్దేవతావిగ్రహమందలి నమ్మ

కముఁగూడ భగ్నముఁజేసి 'ఇతో భ్రష్టస్తతో భ్రష్టః' అన్నట్లధోగతిపాలు మాత్రము వాని నెన్నఁడుఁ జేయనని శ్రీకృష్ణుని శపథము. ఈయభిప్రాయమునే భగవద్గీతలయొక్క నాల్గవ యధ్యాయమందలి 11 వ శ్లోకములో స్పష్టతరముగాఁ దెల్పియున్నారు. ఆశ్లోకమేదియన—

"యేయథామాం ప్రపద్యంతే తాంస్తథైవభజామ్యహం।
మమవర్త్మానువర్తంతే మనుష్యాః పార్థసర్వశః॥"

(ఓయర్జునుఁడా, యెవరేప్రకారముగా నన్ను శరణొందుచున్నారో వారల నాలాగుననే యనుగ్రహించుచున్నాను. ఏలయన, మనుష్యులు సర్వప్రకారములచేతను నాయొక్క మార్గముననే యనుసరించుచున్నారు.)

శ్రీకృష్ణుని హృదయంబునకు నభినవమత నిర్మాతల హృదయంబులకుఁ బర్వతపరమాణ్వంతరమున్నది. కావునఁ బెద్దలిట్లనిరి,

"ఆకాశాత్పతితంతోయం యథాగచ్ఛతిసాగరం।
సర్వదేవనమస్కారః కేశవం ప్రతిగచ్ఛతి॥"

(ఆకాశమునుండి పడు జలము సముద్రములో నెట్లు జేరుమాడ్కి నన్ని దేవతలకుఁ జేయు నమస్కారము కేశవునే చెందుచున్నది)

## యాథార్థ్యము

కొందఱుమహానుభావు లద్వైతమతము నకు విగ్రిహారాధనము సరిపడదని వాదించుచు న్నారు. ఇదికల్ల. ఏలయన, నద్వైత సిద్ధాంత మునుబట్టి జగత్తుమిథ్యయై రజ్జువునందు సర్పం బుభ్రాంతి భాసించునదియైయున్నది గావున నీశ్వ రుని దృశ్యపదార్థముగా భావించుట భ్రాంతి యై, యీశ్వరు నీశ్వరుఁగా భావించుట, (అనఁ గా దృశ్యమయినదానిని భగవంతునిఁగా భావ నచేయుట) జ్ఞానమైయున్నది. ఆహేతువుచేత విగ్రిహము భగవంతునికంటె భిన్నమయినది కాదు. విగ్రిహమును విగ్రిహమనుకొనుటయే భ్రిమ. ఏలయన, నది వాస్తవముగాఁ బరమా త్మయేయైయున్నది.

ప్రిపంచమును బ్రిపంచముగాఁ దలంప వలదు; బ్రిహ్మముగాఁ దలంపవలయును. పా షాణమును బాషాణముగాఁ జూడఁదగదు; పర మాత్మగా గ్రిహింపనగు. కాన, విగ్రిహమును బ్రిహ్మముగా నెంచుటవలన నేమిహాని? విగ్రి హము వాస్తవముగా భగవంతునికంటె నన్య

మయిన పక్షమున, దానిని భగవంతునిగా భా వించుట తప్పు. కాని, తద్వ్యతిరిక్తంబుగాదు గావున నట్టి భావనకర్హమై యున్నది.

ఇట్టి భావనవలన నేమిప్రయోజనం బని ప్రశ్నింపవచ్చును. ప్రతిమనొక శిలగాఁజూచునట్టి భ్రమ తొలఁగునట్లు దానిని భగవంతునిఁగా భావించుట నభ్యసింపవలయును. ఇట్టి యభ్యాసము తదభేదబుద్ధితోఁ గూడియున్నది. త్రాడుపాముగాఁ దోఁచినవ్వాడు భయముకలుగును; దగ్గరనున్నవారది యొక త్రాడని చెప్పుదురు. అప్పుడు, సర్పమువలెఁ బ్రకాశించునది సర్పముకాదని యపవాదప్రక్రియఁ బ్రయోగింపవలసియున్నది. మఱియు, నాసర్పంబు యథార్థముగా రజ్జువేయైయున్నదని పెక్కుసారులు భావింపవలయున్నది. ఇది యారోపప్రక్రియ. ఈ విధంబున, అపవాదముచే, విగ్రహము పాషాణముకాదనితలంపవలయును, ఆరోపమార్గము చేత, భగవద్విగ్రహములకు వెంటికి నేకత్వంబును సాధింపవలయును. ఇది యుపాసనకాదా? విగ్రహము భగవంతునికంటె భిన్నమయినదను

భేదబుద్ధిపూర్తిగా నశించువఱకును, రెండును నొక్కవస్తువేయను నభేదబుద్ధి దృఢమగువఱకును, నారోపాపవాదాత్మకం బయిన యభ్యాసమగత్యమై యున్నది. కాన విగ్రహము యెడల విగ్రహము దురాగ్రహము.

## సఫలభ్రమ

"ఒకవస్తువును మఱియొకవస్తువుఁగా భావించుట భ్రాంతికాదా?" యని శంకించిన యెడల, భ్రాంతియైనను భంగములేదని సమాధానము. భ్రాంతిని నిర్మూలించుటకు భ్రాంతి కావలసియున్నది. సర్వభ్రమలును నుపద్రవకరములే యనుటతప్పు. ఏలయన, సంవాదిభ్రమువలన నష్టములేక పోవుటయేగాక, లాభము చేకూరును. గోదావరినిఁజూచి గంగానదియని భ్రమఁజేసి సేవించిన వానికిఁ బుణ్యములేదా? వేదాంతపంచదశియం దీయర్థము తెల్పఁబడియున్నది. (ప్ర. 9. శ్లో. 8.): "గోదావర్యుదకం గంగోదకం మత్వావిశుద్ధయే। సంప్రోక్ష్య శుద్ధిమాప్నోతి ససంవాదిభ్రమామతః॥" (గోదావరియుదకమును గంగోదకమని భ్రమించి ప్ర

శుద్ధికొఱకు సంప్రోక్షణముచేసి శుద్ధినిబొందుచు న్నాఁడు. ఇది సంవాదిభ్రమయని యెన్నఁబడు చున్నది.). గోదావరికి మాత్రము పవిత్రతశా స్త్రముచేఁ జెప్పఁబడుటలేదా యనిశంకించినయె డల, గంగకుఁ జెప్పఁబడినంత లేకపోవచ్చునని యు, నొక వస్తువును మఱియొక వస్తువని త లంచుట భ్రమయగుట వలన గోదావరినిఁ జూ చి గంగయని తలంచుట భ్రమయేయగుచున్న దనియుఁ దెలియవలెను. గోదావరి దక్షిణగంగ యనిస్తుతింపఁబడుచున్నది; గంగానది యుత్తర గోదావరియని పిలువఁబడుట లేదుకదా; వలయు వ, జాహ్నవి యుపమాన స్థానమలంకరించు చున్నది.

ఏది విశుద్ధికి హేతువని యాగమమువ లన సిద్ధించుచున్నదో, యట్టి గోదావరీజలము ను జేర్కొనుటవలన గ్రంథకారుఁ డనాగమసి ద్ధములయిన రైన్ (Rhine,) థేమ్సు(Thames) మున్నగు నదులం దనాదరభావమును సూచిం చుచున్నాఁడు. సర్పమును జూచి పుష్పమాల యను భ్రమకులోనై దానిఁబట్టుకొనుటవలన

హానికలుగును- దీపమును బుష్పమనియెంచి యాఘ్రాణించుచో నాసాపుటము దగ్ధమగును. మృత్తికాదారు శిలాదిమయములయిన విగ్రహములు దేవతాబుద్ధితో నుపాస్యములని శాస్త్రము వక్కాణించుచున్నది. కావున వాని యారాధనము దోషావహము కానేరదు. చైత్యవందనాదు లనాగమసిద్ధములును నిషిద్ధములునై యున్నవి కావున నవి దోషయుక్తములగుచున్నవి. నిషేధావిషయములయిన భ్రమవిషయములు మాత్రమే సంవాదిభ్రమ గోచరములని గ్రహింపనగు. ఇట్టి భ్రమవలన నష్టము కలుగునందు రేని, లాభము కలుగునని బోధించు శాస్త్రమును ధిక్కరించిన వారగుదురు. కాఁబట్టి పంచదశి యిట్లు నుడువుచున్నది. (ప్ర. 9. శ్లో. 11):

"అన్యథామృత్తికాదారుశిలాస్స్యుర్దేవతాఃకథమ్।
అగ్నిత్వాదిధి యోపాస్యాఃకథంవాయోషి దాదయః॥"

(అట్లుకానిచో, మన్ను, కట్టె, రాయి, మున్నగువానితోఁ జేయఁబడిన విగ్రహములు దేవతలెట్లు కాఁగలవు? పంచాగ్నిపద్యాదులం

దుఁ జెప్పఁబడిన స్త్రీయున్నగు వస్తువులగ్ని యున్నగు వస్తువులని యెట్లుపాసింపఁదగు? అట్టి యుపాసనలు బ్రహ్మలోకాది ప్రాప్తిఫలకంబు లెట్లుకాఁగలవు?) ఇక్కడ, వృత్తికాదారు శిలలకును దేవతలకును సామానాధికరణ్యమువలన నభేదబుద్ధి బోధింపఁబడుచున్నది; అంతర్యామిత్వము పరామర్శింపఁబడుటలేదు; అనగా, వృత్తికాదారుశిలాదులే దేవతలని తెల్పఁబడినవి; వృత్తికాదారు శిలాదులందు గూఢముగానున్న పరబ్రహ్మము మాత్రమే దేవతగా భావింపఁదగినదని యభిప్రేతంబుకాదు.

మఱియు, నుపాసనయందు, నిర్దిష్టమైన వస్తువుమాత్రమే నిర్దిష్టమయిన వస్త్వంతరముగా భావింపఁదగు. ఉదాహరణమందలి స్త్రీనిమాత్రమే యగ్నిగాఁజూడవలయును--కొబ్బరిచెట్టునుగాదు; నిర్దిష్టపంచకమందే బురుషాదుల నగ్నిగాభావింపవచ్చును.

అనిర్దిష్టమైనదిగాఁ గూడ భావింపఁగూడదు. స్త్రీని గల్పవల్లిగా నుత్ప్రేక్షించుట కవులకుచితమగుఁగాక. అది యుపాసకులకనుచితం

ము. మఱియు, వివేదనకర్తృంబులయిన పదార్థములు నిర్ణయింపఁబడిన చందమున, నుపాసనకు యోగ్యములయిన విషయంబులును నిశ్చయింపఁబడియున్నవి, అట్టి విషయములందును దారతమ్యము వచింపఁబడియె: వినాయకచవితినాఁడు సువర్ణవిగ్రహమును బూజించుట ముఖ్యమనియు, మట్టితోఁ జేయబడిన విఘ్నేశ్వరునిఁ బూజించుట యధమమనియు నుడువఁబడినది. తులసీదళములతో శివునిఁ బూజించుటయు, బిల్వపత్రములతో విష్ణునారాధించుటయుఁ, దులసితోఁ జేయఁబడిన మాలికతో శివమంత్రమును జపించుటయు, రుద్రాక్షమాలికతో విష్ణుమంత్రమును స్మరించుటయుఁ, గూడని యట్లు శివవిగ్రహమందు విష్ణుభావనయు విష్ణువిగ్రహమందు శివభావనయుఁ గూడవు. ఏలయన, వివిధదేవతలకు వివిధవిగ్రహాకృతులు శాస్త్రముచే నిర్ణయింపఁబడినవి. పార్వతీపరమేశ్వరుల నొక్కసారిగా నుపాసింపఁ దలపెట్టినవాఁ డర్ధనారీశ్వర విగ్రహమును గ్రహింపవచ్చును. శివకేశవుల నంపుటిని ధ్యానింపఁదలచినచో హరిహరనాథ విగ్రహము పనికివచ్చుఁగాక. అంతే

మాత్రమున ప్రతినియత విగ్రహవత్త్వము కే
శవాదులకు లోపింపనేరదు. కేవల కేశవుఁడు
వలయువారలు కేశవోచిత విగ్రహమును మా
త్రమే స్వీకరింపవలయును. మఱియు, దేవతల
కు రూపాంతరమునొందు శక్తియున్నను, స్వా
భావిక రూపములు లేవనుటకువీలులేదు, ఏల
యన, మృత్తునకు ఘటశరావాద్యాకృతి భేద
ప్రాప్తియున్నను, గంధవత్త్వాది నైసర్గికస్వరూ
ప హానిలేదు, నటునకు యుధిష్ఠిరాదివేషధారి
త్వము యాదృచ్ఛికమైనను, తాత్కాలికమై
యున్నది, నాటకాంతమున యజ్ఞదత్తుఁడు మ
రల యజ్ఞదత్తుఁడే యగుచున్నవాఁడు. ఇది యి
ట్లుండనిండు. కావున శాస్త్రీయ భ్రమవలన
లాభముగలదు.

## తాదాత్మ్యభావన

విగ్రహములను భగవంతునిఁగా భ్రాంతి
చేత మనముగ్రహించి యారాధించుచున్నార
మని మన ప్రతిపక్షులాక్షేపించినపుడు మనలోఁ
బండితమ్మన్యులు కొందఱీరీతిగా సమాధానముఁ
జెప్పుచున్నారు. "మేము పిచ్చివారమా? మా

నవనిర్మితములై జడములయిన విగ్రహములకు ను, నిత్యుఁడునుసర్వజ్ఞుఁడునగు సర్వేశ్వరునకు ను, భేదము మాకుఁదెలియదా? విగ్రహములు పరమేశ్వరుని స్మరింపఁ జేయుటకును, ధ్యానము వలనఁ జిత్తైకాగ్ర్యము సిద్ధించుటకును, నుద్దే శింపఁబడినవి; విగ్రహమే భగవంతుఁడని భావిం చుటకుఁ గాదు. కావున మేము విగ్రహారాధకు లము కాఁజాలము''

కాని, యుక్తాయుక్తమై శాస్త్రసమ్మత మయిన పనికిమనమేల సిగ్గుపడవలెను? మఱి యు, మనము యథార్థముగాఁ జేయుచున్న విగ్రహారాధనము విగ్రహారాధనము కాదనుట బొంకుకాదా?

విగ్రహము భగవంతుఁడను విషయము పంచేంద్రియగోచరము గాకపోయినను శాస్త్ర సిద్ధమగుటవలన, విగ్రహత్వబుద్ధినశించి బ్ర హ్మత్వబుద్ధి విగ్రహమందు జనించువఱకును విగ్రహమును బ్రహ్మంబుగా ధ్యానింపవలయు నని శాస్త్రములందుబోధింపఁబడలేదా? పాషా ణాది మయములయిన ప్రతిమలందుఁ శాస్త్రప్రో క్తములయిన చతుర్భుజత్వాది భగవద్రూపము

లనారోపించి, చతుర్భుజత్వాదిబుద్ధిచేఁ బాషాణత్వాదిబుద్ధిని బాధింపవలయును.

శ్రీ సురేశ్వరాచార్యులు తైత్తిరీయవార్త్తికమున నిట్లానతిచ్చియున్నారు.

‘‘శాస్త్రోక్తితధియోపేత్య హ్యాతాదాత్మ్యాభిమానతః।
చిరాసనం భవేద్యత్తదుపాసనముచ్యతే’’

(శాస్త్రముచేతఁ జెప్పఁబడిన దేవతయను భావముతో నొక యుపాస్యవస్తువును బొంది యట్టి వస్తువే దేవతయను నభేదబుద్ధి జనించువఱకును జిత్తమద్దానియందుఁ జిరకాలము నిలుచుటయే యుపాసన మనఁబడుచున్నది.)

ఈయభిప్రాయమునే శ్రీ విద్యారణ్యులు తైత్తిరీయ భాష్యమున (శిక్షావల్లి అను.౩) నిటుల విస్తరించియున్నారు—

‘‘యద్యపి ప్రక్షరణే హోమజప్య మంత్రావృత్తి సంఖ్యైవ ప్రతిపత్త్యా ప్రవృత్తేః యత్నాన్తరవ్యవచ్ఛిద్యతే, తథాపి యస్మిన్ ప్రతీకే యద్దేవతా దృష్టిర్విహితా తత్ప్రతీకం తద్దేవతారూపమితి నిరూఢోభిమానః యావత్సంపద్యతే, తావదావర్తయేత్. అతఏవవార్త్తికకారైరుక్తం— ‘శాస్త్రోక్తిత ధియో...ఉచ్యతే’ ఇతి. తథాప్రబుద్ధాః అహాత్మ్యాః కించిదాగ్రహమూర్తం కాలం రాశ్యభిషిచ్య, యావతా కా

తేనపర్యాసాంప్రతిజ్ఞావామయం రాజేత్యభిమానేన తదాజ్ఞా
నువర్తిత్వం సంపద్యతే తావదప్రమత్తాస్తం ప్రయత్నేన
పరిపాలయంతి, తద్వత్. సంతస్నే ప్రతీకవిషయే దేవతా
భిమానే వపునస్తద్దృష్టిరస్తైతి. యథా జీర్ణ దేవతాలయే
శిలాతాలాతాడభ్య పూజారహితామపి ప్రతిమాం దృష్ట్వా
దేవతా బుద్ధిరనువర్తతే తద్వత్. తస్మాత్ప్రతీకే దేవతా
భిమానదార్ఢ్యపర్యంతముపాసీనస్య యథోక్త ఫలంసిద్ధ్యతీతి'
(పురశ్చరణమందు హోమ జప్యమంత్రము లె
న్ని పర్యాయములు జరుగవలెనో వాని సంఖ్య
నిర్ధారింపఁబడిన రీతిగాఁ బ్రతీకము నెన్నిమాఱు
లు దేవతగా ధ్యానింపవలయునో యట్టి మితి
యెచ్చటను శాస్త్రమున వినఁబడకపోయినను,
నే ప్రతీకమందే దేవతయను బుద్ధి విధింపఁబడిన
దో, యాప్రతీకమా దేవతారూపమై యున్న
దను దృఢమైన నమ్మక మెంత కాలమునకుఁ
గలుగునో యంతదనుక భావన జరుగుచునే
యుండవలయును. అందువల్లనే శ్రీసురేశ్వరా
చార్యులచే 'శాస్త్రార్పిత...' అని బోధింపఁబడి
నది. తెలివిగల మంత్రులొక బాలుఁడైన రా
జకుమారుని రాజ్యమునకుఁ బట్టముగట్టి, యెం
త కాలమున కాతఁడు రాజను నభిమానముచేతఁ

ప్రజలందఱు నాతని యాజ్ఞకు లోఁబడువారర్యెవరో యంతవఱకును నాతవి నెట్లు జాగరూకతతో సంరక్షించుచునేయుందురో, యటులనే ప్రతీకమందు దేవతాబుద్ధి స్థిరపడువఱకును ప్రతీకోపాసన మావశ్యకంబు. ప్రతీకము దేవతయను నమ్మకము కలిగినయెడల నిఁక నట్టి భావము తొలఁగనేరదు. ఎట్లన, శిథిలమైన దేవతాలయమునఁ జిరకాలమునుండి పూజలేకయున్న ప్రతిమనుజూచినను, నిది దేవతయే యను బుద్ధి కలుగుచునే యుండును. అటులనే. కావునఁ బ్రతీకమందు దేవతాభిమానము దృఢమగువఱకును నుపాసించువానికి శాస్త్రోక్త ఫలంబు సిద్ధించునని యెఱుంగవలయును.)

ప్రత్యక్షమువలన నొకవిగ్రహము జాడ్యాది దోషోపేతమై పొడకట్టును. కాని, యాగమ ప్రమాణమువలన, దానిని సర్వజ్ఞత్వాది విశిష్టమైన పరమేశ్వరుఁగా మనము స్వీకరింపవలయును.

## ద్వివిధప్రశ్నము

ఈశ్వరునకు రూపము లేదు గావున విగ్ర

హారాధనము కూడదని కొందఱు వాదించుచు న్నారు. ఈవాదము సరియైనదికాదు. ఏలయన, నాతఁడు నిర్గుణుఁడును సగుణుఁడును నై విలసి ల్లుచున్నాఁడు. సగుణ బ్రహ్మముఁ జూచుటకుఁ బ్రతిమార్చనము కావలయును. నిర్గుణ బ్రహ్మ ము నెఱుంగుటకుజ్ఞానముమాత్రమే సాధనమగు చున్నది. శ్రీ శంకరాచార్యు లిట్లానతిచ్చియు న్నారు (బ్రహ్మసూత్రభాష్యము)

"ద్విరూపం హిబ్రహ్మ అవగమ్యతే, నామరూపవికార భేదోపాధివిశిష్టం తద్విపరీతంచ సర్వోపాధి వివర్జితం"

(బ్రహ్మమిఱు తెఱంగులఁ బరఁగుచున్నది. నామ రూప భేదోపాధులతోఁ గూడినది, దానికివ్యతి రేకమై సర్వోపాధి రహితమైనది)

విష్ణుపురాణ (1-22 53) మిటులఁ దెలు పుచున్నది—

"ద్వేరూపే బ్రహ్మణస్తస్య మూర్తంచా మూర్తమేవచ।
క్షరాక్షర స్వరూపేతే సర్వభూతేషు చస్థితే
అక్షరం తత్పరం బ్రహ్మక్షరం సర్వమిదం జగత్"

(మూర్తము నమూర్తమునని యా బ్రహ్మము నకు రెండు రూపములున్నవి. అవి క్షరాక్షర స్వరూపములు; సర్వభూతములందును నిలచి

యున్నవి. అక్షరమనఁ బరబ్రహ్మము. క్షరమీ సమస్తజగత్తునై యున్నది.)

సోపాధిక బ్రహ్మోపాసనము నిరుపాధిక బ్రహ్మజ్ఞానమునకు సాధనమగును. శ్రీపతంజలి సమాధి రెండువిధములని వాక్రుచ్చియున్నాఁడు— సంప్రజ్ఞాత సమాధి, యసంప్రజ్ఞాతసమాధి. మొదటిదానియం దుపాసకునియొక్కయు, నుపాసింపఁబడుచున్న దేవతయొక్కయు, నుపాసనయను క్రియ యొక్కయు జ్ఞానముగలదు. రెండవదానియందీ త్రిపుటియును సుఖాంబుధియందు లయమగును. కావున, జ్ఞాతృజ్ఞేయజ్ఞానంబు లింకను గలవారు నిర్గుణ బ్రహ్మంబు ననుభవించుట కల్లయేగదా. ఉట్టికెగరలేనివారు స్వర్గమున కెగరఁగలరా? సంప్రజ్ఞాత సమాధినైనను సాధింపఁజాలనివా రసంప్రజ్ఞాత సమాధి నందుట యసంభవముకాదా?

పరమేశ్వరున కెట్టిరూపమును లేదనియు భక్తుండే రూపమును ధ్యానించిన భావనవలన వాఁడారూపమునే జూచునట్లు భ్రమించుచున్నాఁడనియు, గొందఱు వాదించుచున్నారు. ఇదిసరికాదు. ఏలయన, నీశ్వరునకు రూపములు

కొన్ని వాస్తవమైనవి గలవని శాస్త్రము ఘో
షించుచున్నది. ఎట్లన విష్ణునకునాలుగు భుజ
ములు గలవు, శివునకు మూఁడునేత్రములున్న
వి. ఈరూపములు కేవలభావనయొక్క కార్య
ములుగావు. అవి భక్తుని మనస్సుచేతఁ గల్పిం
పఁబడినవిగావు; విష్ణునకుఁజతుర్భుజములు భక్తుఁ
డొకఁడట్లు భావించుటవలనఁబుట్టినవి కానేరవు.
మఱియేమన, విష్ణుదేవుండారూపమును దాల్చు
ట కుద్దేశించెను గాన నవి సిద్ధమైనవి. అట్టియు
ద్దేశము భక్తులలో ననేకుల వాంఛ కనుగుణ
మైనదిగా నుండిన నుండుఁగాక. కాని యాతని
సంకల్పము పరాయత్తమైనదిగాదు. ఈశ్వర
సంకల్పము మానవసంకల్పముకంటె వాస్తవ
ము నమోఘము నై యున్నది. ఈశ్వరుఁడు
సత్య సంకల్పుఁడు; ఆతని కోరిక సఫలమైనది.

ఈశ్వరుఁడిట్టి నియతరూపములలో మా
త్రమేగాక రూపాంతరములతోఁ గూడ భక్తుల
కు దర్శనమీయవచ్చును. భక్తుఁడే రూపమును
గోరిన, భగవంతుఁ డాతనికా రూపముననే బ్రి
త్యక్షమగును. కాఁబట్టి శ్రీకృష్ణుండిటుల గీత
యందు (అ. 7 శ్లో. 21) వాకొనియున్నాఁడు:-

"యోయో యాంయాంతనుంభక్తః శ్రద్ధయార్చితుమిచ్ఛతి।
తస్యతస్యాచలాం శ్రద్ధాం తామేవవిదధామ్యహం"

(ఏయేభక్తుఁడేయే విగ్రహమును నమ్మకముతో సేవించుటకుఁ గుతూహలుఁ డగుచున్నాఁడో, యా యా భక్తునకట్టి నమ్మకమునే నిశ్చలమైన దానిఁగాఁ జేయుచున్నవాఁడను) ఇట్టిరూపముల యినను భ్రాంతి విలసితములు కానేరవు; ఏల యన, నితరవస్తువులవలె నివియు నీశ్వరునివల్ల నే సృజింపఁబడుచున్నవి. కోరుట మాత్రమే భక్తుఁడు చేయునది; సృజించుట పరమేశ్వ రుని పని.

ఈశ్వరునిచే నంగీకరింపఁబడని పదార్థ మసత్యమగుచున్నది; ఒకపిచ్చివానియొక్కగాని, సన్నిపాత రోగియొక్కగాని, మనోరాజ్య మీ శ్వరేచ్ఛకు వ్యతిరేకముగా నుండుటవలన మిథ్య యగుచున్నది. కాని, యుపాస్య వస్తువుగా విగ్రహము భగవంతునిచే నంగీకరింపఁబడుచు న్నది. అట్టి యుపాసనయొక్క ఫలముగా నా విర్భవించిన భగవద్రూపముకూడ నాతనికిసమ్మ తమగుచు, నాతనిచేతనే నిర్మింపఁబడుచున్నది. కాబట్టి పరమేశ్వర వినిర్మితములయిన భూగో

గాను లెంతసత్యములో భక్తునకుఁ బ్రత్యక్షము
లైన భగవద్రూపములు నంత సత్యములు.

కొన్ని ప్రమాణ వచనములవలన బ్రహ్మమునకు రూపము లేదని కొందఱనుచున్నారు. కాని, రూపము నిర్దేశించు వాక్యములుకూడఁ గొన్ని గలవు గావున రూపముగలదని మనమే లగ్రహింపరాదు? చంద్రునకు రూపమున్నది గావున బ్రతిబింబమున్నది. అటులనే జగదీశ్వరునకును రూపములు కొన్ని శాస్త్రసిద్ధములు; కాబట్టి వాని ప్రతిమలను మనము సేవింప వచ్చును.

ఆక్షేపము—చంద్రప్రతిబింబ మచ్చముగాఁ జంద్రునిఁ బోలియున్నది. విగ్రహ మన్ననో, భగవద్దేహమునకంటె విలక్షణమైయున్నది. కావునఁ బ్రతిమార్చనము భగవదర్చనము కానేరదు.

సమాధానము—ఛాయాగ్రాహక యంత్రము (ఫోటోగ్రాఫ్) చే గ్రహింపఁబడిన ప్రతిరూపము పూర్ణముగా నొకమనుష్యుని రూపముఁ బోలియుండదు. కొన్ని యంశములందు బింబ ప్రతిబింబములకు భేదమున్నది. ఛాయా

పటమున నొకఁడు మిక్కిలి యందమైన వాఁడు గాఁ దోఁచును. కాని, ప్రత్యక్షముగాఁ జూడఁబడి నప్పుడాతఁ డతికురూపియై పొడకట్టును. అవ్విధంబున, విగ్రహము భగవంతునితో నన్నియంశములందును సమానము గాకపోవచ్చును. అయినను విగ్రహము భగవంతుని వ్యక్తీకరింపఁ గలదు. ఇరువది వత్సరముల ప్రాయముగల దేవదత్తుఁ డేఁబది వత్సరముల వయస్సుగల దేవదత్తుఁడు కాఁడు. కాని మొదటికాలమున నాతఁ డొనరించిన కార్యములకు రెండవకాలమున నాతఁడు బాధ్యుఁడు గాకపోవునా? కావున విగ్రహమునకును బరమాత్మకును నించుక వైలక్షణ్యమున్నను విగ్రహ మారాధనకు యోగ్యమగుచున్నది.

మఱియు, భగవంతుఁ డనంత రూపములఁ దాల్చుటకు శక్తిగలవాఁడు గావున విగ్రహ మాతని యనంత రూపములలో దేనితోడను గూడ నేకీభవింపక పోయినను, నయ్యది యనంతరూపములలో నొకదానితోఁ దుల్యము కాఁగలదు. అనఁగా విగ్రహముయొక్క రూపము భగవంతుని రూపమును బోలును; లేదా,

భగవంతుని రూపమే విగ్రహ రూపము ననుక
రించును. కావున శాస్త్ర నిర్ణీత రూపముకంటె
నన్యమైన రూపముతో భగవంతుఁడు గలఁడని
భక్తుఁడొకఁడు తలఁచినను, వానిమనోరథము
ననుసరించియే వానికిఁ బరమేశ్వరుఁడు ప్రస
న్నుఁడు కాఁగలఁడు. కాని, శాస్త్రసిద్ధరూపము
లనుపాసించుట వలనఁ బరమేశ్వరుఁ డచిర
కాలమునకే ప్రసన్నుఁడగును. కావున శాస్త్ర
ప్రదర్శిత మూర్తులే యుపాసనకుముఖ్యములు.

మఱియు, నామముఁగూడ నీశ్వరునకు
నిషేధించుట మీకు సమ్మతమగునా? ఏఁయన
మీ ప్రమాణవచనములు, రూపముమాత్రమే
కాదు, నామముఁ గూడ నిషేధించుచున్నవి.
వాక్కునకును మనస్సునకును నతఁడతీతుఁడగు
టవలన నవాఙ్మనస గోచరుఁడనఁబడుచున్నను
నాతనికి నామమును మీరు గ్రహించుచునే
యున్నవారు. ఓపరమేశ్వరుఁడా యని పిలుచు
నప్పుడాతనికి మీరాగ నామమిడినవారు గారా?
నామము కూడనిచో మీప్రార్థనల నిఁకఁ గట్టి
పెట్టవలయును. ఈశ్వరుఁడా యని మొఱవెట్టుట
కవకాశము లేకపోవును. అయినను జగదీశ్వరు

నకు నామమును స్వీకరించెదలేని, రూపముఁ గూడ స్వీకరింపఁడు.

ఆక్షేపము:—నామరూపములు గలవని పల్కిన వచనములకును లేవని దెల్పినవానికిని విరోధము లేదా?

సమాధానము—అట్టి విరోధమే లేదు. ఏలయనఁ బరమేశ్వరుఁడుభయాత్మకుఁడై యొప్పుచున్నవాఁడు. కొన్ని వాక్యములుసాకారుని నిరూపించుచున్నవి గాన నీశ్వరుఁడు సాకారుఁడగును. మఱికొన్ని నిరాకారుని బోధించుచున్నందున నాతఁడు నిరాకారుఁడునగు. రెండు విధములయిన వాక్యములును ప్రమాణము లేకాఁబట్టి యన్యతర పరిత్యాగము పొసగదు. "నిష్కళం నిష్క్రియం శాంతం నిరవద్యం నిరంజనం" (శ్వేతాశ్వేతరోపనిషత్తు 6-19) మున్నగునవి నిర్గుణశ్రుతులు. ఇవి కళ్యాణగుణ రాహిత్యమును దెల్పునవి కావనియు, హేయ గుణ శూన్యతను మాత్రమేసూచించునవనియు, శ్రీ మద్రామానుజాచార్యులు నుడివియున్నారు (శ్రీభాష్యము 1-1-1)—

"ఇతిచేన్నిర్గుణవాక్య విరోధః, ప్రాకృత హేయగుణవిషయత్వాత్తేషాం"

(నిర్గుణవాక్య విరోధము లేదు. ఏలయన, నవి ప్రాకృతములైన హేయగుణములు బ్రహ్మమున లేవని దెల్పుటకుద్దేశింపఁబడినవి)

సగుణబ్రహ్మ బోధక వాక్యములు "బహుస్స్యాం" మొదలైనవి. ఇయ్యవి పరమేశ్వరుని యనంత మంగళ గుణంబులను పేర్కొనుచున్నవని శ్రీరామానుజుల తాత్పర్యము. నిర్గుణవాక్యములు కూడ సగుణపరములే యనుటకంటె, నిర్గుణవచనములు నిర్గుణబ్రహ్మమాత్రబోధకములనిగ్రహించుటయే మేలని శ్రీశంకరాచార్యుల యభిప్రాయము. రూపమొక వస్త్రము వంటిది. ఈశ్వరుఁడు వస్త్రము ధరించినవానిఁ బోలుచున్నవాఁడు. మనుజుఁడు పుట్టినప్పుడెట్టి వస్త్రముతోడను బుట్టలేదు; అటులనే భగవంతుఁడు స్వభావముచేత రూపరహితుఁడు. కాని, మానవుఁ డిచ్చవచ్చిన బట్టను ధరింపఁగలఁడు. అటులనే సర్వేశ్వరుఁడతని కిష్టమైన రూపమును దాల్చి భక్తునికి గోచరుండు కాఁగలఁడు. వస్త్రరహితుఁడను వాక్యమునకును

వస్త్రసమేతుఁడను వాక్యమునకును విరోధము లేదు; అవ్విధంబున, రూపరహితుఁడను వచనములకును రూపసహితుఁడను వచనములకును విరోధమేమియును లేదు.

## అసత్యమునుండి సత్యము.

క్రిందటి రీతిగా నాక్షేపించుచున్నారు. "అసత్యమైనది సత్యము నెట్లు ప్రకాశింపఁ జేయఁగలదు? పరమాత్మకంటె భిన్నమైనవిగ్రహము పరమాత్మ నెట్లు దెలుపఁగలదు?" మిథ్యయైన పదార్థముకూడ సత్యమైనదానిని వెల్లడింపవచ్చునని వీరికి సమాధానము. శ్రీశంకరాచార్యులు బ్రహ్మసూత్ర భాష్యమున (2-1-14)—

"కథంత్వసత్యేనహి వేదాంతవాక్యేన సత్యస్య బ్రహ్మాత్మత్వస్య ప్రతిపత్తి రుపపద్యేత ?—ఇతిచేత్"

(అసత్యమైన వేదాంత వాక్యముచేత సత్యమయిన బ్రహ్మాత్మత్వముయొక్క జ్ఞానమెట్లుసంభవించును?)

అని శంకను బ్రారంభించి దానికి సమాధానముగా—

"తథాకారాది సత్యాక్షర ప్రతిపత్తిర్దృష్టా రేఖానృతాక్ష రప్రతిపత్తేః"

(అటులనే రేఖారూపములును మిథ్యాభూతములగు నక్షరములవలన నకారాది సత్యాక్షరజ్ఞానము చూడంబడుచున్నది)

అని నుడివియున్నారు.

ఇట్టి జ్ఞానము మిథ్యకాదు. ఏలయన, శ్రీవాచస్పతి మిశ్రులు భామతియను గ్రంథమున నిటుల వచించియున్నారు—

"శాఖినః నాగఇతివానగఇతివాపదాత్ కుంజరంవాతరుం వా ప్రతిపద్యమానాః భవంతి భ్రాంతాః"

(నాగమనుపదమువలన గజమును, నగమనుపదమువలన వృక్షమును గ్రహించుచున్న లోకులు భ్రాంతులు కానేరరుగదా)

పరమార్థసత్యములుగాని వస్తువులవలన సత్యములయిన వస్తువుల జ్ఞానమూదయింపం గలదు. వేదములు ద్వైత ప్రపంచమునందంతర్భూతము లగుటచే నపారమార్థికములైనను, పారమార్థికమైన బ్రహ్మమును బ్రకటింపం జాలును. వేదములు మిథ్యయైనంత మాత్రమునం దత్ప్రతిపాదితమైన విషయముకూడ మిథ్యకానక్కఱలేదు. వ్రాయంబడిన అ, ఇ, మొదలగు గీతలు అ, ఇ, మున్నగు స్వరములను

చెప్పుట లేదా?

మఱియు, స్వప్నానుభవము వాస్తవము గాదు. అయినను స్వప్నములు కొన్ని భవిష్యద్విషయములను సూచించుచున్నవి. కొన్ని గతించిన కార్యములను స్ఫురింపఁ జేయుచున్నవి. ఒకఁడు లాభము నొందినట్లు రాత్రి స్వప్నము వచ్చును. అప్రకారమే వ్యాపారమున గొప్ప లాభము చేకూరెనని వార్త పిమ్మటఁ జేరుచున్నది. స్వప్నదృష్టములగు జంతువులు నిజమైనవి గావు. అయినను, గొన్ని జంతువులు స్వప్నమునఁ జూడఁబడినయెడల, నవి సంభవింపఁగల యాపదనుగాని, సంపదనుగాని, తెలియఁజేయుచున్నవని స్వప్నశాస్త్రజ్ఞులు చెప్పుచున్నారు.

మఱియు, బిందు(point) వనఁగా నేమి? సుద్దతో నొకబల్లపై వ్రాయఁబడిన బొట్టు బిందువు కాఁగలదా? బిందువునకు భాగములుగాని, పరిమాణముగాని యంగీకరింపఁ బడుట లేదుగదా. సుద్దతో లిఖింపఁబడిన బొట్టునకన్నను, రెండును గలవు. కావున, నది బిందువు కాజాలదు. కాకపోయినను, నయ్యది బిందువును వ్యక్తము

చేయుచున్నది. బిందువులవలన గీత లేర్పడు చున్నవి. సుద్దతో వ్రాయఁబడిన బిందువులు నిజమైనవికావు. కాబట్టి సుద్దతో వ్రాయఁబడిన గీతలును నిజమైనవిగావు. గీతలు కలసి చతుర్భుజాది రూపము లందుచున్నవి. సుద్దవలనఁ గల్గిన గీతలబద్ధములు గావున సుద్దతోఁ జిత్రింపఁబడిన చతుర్భుజాదులును నబద్ధములైనవే యగును. కాని, వీని నెల్ల మీరు పరిత్యజింపఁగలరా? విగ్రహములను మాత్రము విసర్జింపనేల? బిందువునకుఁ బరిమాణముగాని, రూపముగాని, లేకపోయినను, నయ్యది సుద్దయొక్క బొట్టుచే సూచింపఁబడఁగలదు; అటులనే బ్రహ్మమునకు రూపాదులు లేకపోయినను, నది ప్రతిమచేత నిర్దేశింపఁదగియున్నది.

అదియునుంగాక, మిథ్యయైన వస్తువు తథ్యమైన ఫలంబు నొసంగఁజాలదనుటతప్పు; ఏలయన, భ్రమవలనఁ బ్రాణము విడిచినవారు గలరు, త్రాడు పాముగాఁ దోఁచినప్పుడట్టి మిథ్యాసర్పము వలనఁ గొందఱు భయకంపములఁ బొందుట లేదా? త్రాడును జూచి పుష్పమాలయని భ్రమపడిన వారికా మిథ్యాస్రజమోమా

దమును గూర్చుటలేదా?

మఱియు, శాస్త్రములందుఁ దఱచుగా నొక పదార్థమునకు మొదట నొక నిర్వచనము చూపట్టుచున్నది; క్రమముగా నది మాఱుచున్నది; తుదకు నిశ్చితమైనది పొడకట్టుచున్నది. ప్రథమంబునవే నిశ్చితమైనది ప్రదర్శింపఁ బడిన చో నధ్యాపకుల చిత్తంబులు దానిని గ్రహింప లేకపోవచ్చును. స్థూలారుంధతీ న్యాయమును విచారింపుఁడు: అరుంధతి యిదియని పెద్దలు పిన్నలకుఁ దెల్పుచున్నారు. వారు జూపిన పెద్ద నక్షత్రమదియు నరుంధతి కాదు. కాని, క్రమముగా నమీపమునకుఁ జిత్తమాకర్షింపఁబడి, తుద కరుంధతియందే స్థాపింపఁబడు చున్నది. శ్రీ శంకరాచార్యులీ న్యాయము (బ్రహ్మసూత్ర భాష్యము. అ 1 పా 1 సూ 12) నిట్లు వివరించియున్నారు—

"యథారుంధతీ నిదర్శనే బహ్వీష్వపి తారాస్వముఖ్యా స్వరుంధతీషు దర్శితాసు యా ప్రథమం ప్రదర్శ్యతే, సాముఖ్యైవారుంధతీ భవతి; ఏవమిహాప్యానందమయస్య సర్వాంతరత్వాన్ముఖ్యమాత్మత్వం"

(అరుంధతీ నిదర్శనమున, వాస్తవముగా నరుం

ధతీ నక్షత్రములుగాని యనేక నక్షత్రములు చూపింపఁబడినవైనను, దుతకెయ్యది ప్రదర్శింపఁ బడుచున్నదో, యదినిజమైన యరుంధతియే యెట్లగునో, యటులనే యానందమయ సందర్భమునను నానందమయుఁడే కోశములన్నిటికంటెను లోపలఁగా నుండుటవలన యథార్థమైనయాత్మయగును.)

మొదటనే నిజమైన యరుంధతినిగుర్తించుట కష్టము. కావునఁ గల్పితారుంధతులు కొన్ని చూడఁదగియున్నవి సూక్ష్మమగు నాత్మపదార్థము స్థూలములై పామరజనగ్రాహ్యములైన యన్నమయాది కోశములద్వారమున గ్రహింపఁ గలము. స్థూలపదార్థము ద్వారమున సూక్ష్మపదార్థమును గుర్తింపఁగలము. స్థూలమైన విగ్రహమువలన సూక్ష్మమైన బ్రహ్మంబు మనకుఁ బ్రత్యక్షమగును. విగ్రహమే బ్రహ్మంబు గాకపోవుఁగాక; తత్సాక్షాత్కారమున కది సాధనంబు.

## ప్రతిబింబ ప్రామర్శము.

భావ — శబ్దమే యర్థము కాదు. అయిన

వ్యక్తీకరించుటలేదా? ఆరీతిగా, నశ్వరములగు పాషాణాది విగ్రహములు శాశ్వతంబగు బ్రహ్మంబు నేల వ్యక్తము సేయనేరవు?

దర్శనము— కంటి కెదురుగానున్న వస్తువు కన్నుయొక్క నల్లని భాగమునం బ్రతిఫలించుననియు, నట్టి ప్రతిబింబ జ్ఞానమువలన బాహ్యవస్తు జ్ఞానముదయించుననియు, నందుచేత మనసము నిజముగాం జూచునది ప్రతిబింబము మాత్రమేయనియు, బింబము కాదనియు, గ్రుడ్డివానికిట్టి ప్రతిబింబము సంభవింపదు గావున వానికి మనలవలె ముందుంగల పదార్థమును గుర్తింపం జాలడనియుం, జెప్పంబడుచున్నది. ఇప్పుడు, మన విగ్రహవిద్వేషులు నేత్రమునం బ్రతిబింబ మక్కఱలేకయే బాహ్యవస్తువును జూడంగలరా? స్థూలమైన పదార్థమును విలోకించుటకే విగ్రహమావశ్యకమైయుండ, సూక్ష్మంబగు బ్రహ్మంబు నెఱుంగుటకు విగ్రహమెంత యావశ్యకమో యూహింపుఁడు.

భావప్రపంచము— నేత్రములను విప్పినప్పుడు మనకొక వృక్షము కనంబడుచున్నది. నయనములను మూసికొనినను మఱల వృక్షంబా

వృక్షాకారంబు భాసించుచునేయుండును. రెంటిలో, నేదబింబ, మేది ప్రతిబింబము? కొందఱు చిత్తగతమైన వృక్షమే వాస్తవము గావున బింబమనియు, బాహ్యవృక్షము మిథ్యగావునఁ బ్రతిబింబమనియు నమ్ముచున్నారు. మఱికొందఱు బాహ్య వృక్షమునకే వాస్తవత్వమును, మానసవృక్షమునకు మృషాత్వమును, గ్రహించుచున్నారు. ఎట్లైననేమి? ఒకటిమాత్రమే సత్యమై, రెండవది మిథ్యయగుచున్నది. భావప్రపంచము బాహ్యప్రపంచమునకుఁ బూర్వమందయుండి దానికి మూలమగునేని, బాహ్యప్రపంచము మిథ్యాభూతమైనను ననుభవయోగ్యం బగుచున్నది. బాహ్యప్రపంచమే ప్రాథమికమై భావప్రపంచ కారణమను పక్షమునఁ గూడ, మృషాత్మకంబగు భావ ప్రపంచమునకుపయోగము గలదు. ఇట్లు, మిథ్యయైనదికూడ లోకవ్యవహారమున కుపయుక్త మగుచుండ, జగదీశ్వరుని విగ్రహము మాత్రముపయుక్తము గాకపోవునా?

చిత్తపరిణామము—మనంబు వస్తుగావము రెండుగ [illegible] న్నదనియు, నన్నిటది మనకుఁ

ప్రత్యక్షముగుననియుఁ జెప్పఁబడుచున్నది. చిత్తము మొదట నొక వృక్షముయొక్క యాకృతినిఁ దాల్చుచున్నది; అటుపిమ్మట నేనొక వృక్షమును జూచుచున్నానని జ్ఞానముదయించును. కొంత తామ్రము కరఁగింపఁబడి యొక మూసమునఁ (లోతైన యచ్చుదిమ్మయందుఁ) బోయఁబడిన యెడల, నది తద్రూపమున ఘనీభవించును. మూస పొడవుగా నుండినఁ, దద్గత తామ్రమును బొడవుగా నేర్పడును; అది వర్తులమైనచో, నిదియు వర్తులమగును; అందచందములు గలవేని, నిందుమనవి సిద్ధమగుచున్నవి. దృశ్యపదార్థమొక మూసవంటిది. చిత్తము కరఁగింపఁబడిన తామ్రమును బోలును: అది చూడఁదగిన వస్తువుల యాకారమును దాల్చుచున్నది. మనంబున కట్టి యాకారమును లేకపోయినను, విషయసాక్షాత్కార మందది ఘటాదులుగాఁ బరిణమించును. ఈవిధంబున, బ్రహ్మం బెట్టి యాకృతియు లేనిదయ్యుఁ, జతుర్భుజాదులుగల శరీరములను ధరింపఁగలదు.

స్మృతి—పూర్వమనుభవింపఁబడిన పదార్థము పిమ్మట మనంబునఁ దట్టుట. నిన్న మనకు

గృహమున వసియించితిమో, దానిఛాయ మన చిత్తమునం బడుచున్నది. మనమీదినమునం బ్రాతఃకాలమున దూరముగా నెచ్చటికైనను బోయియున్నను, సాయంకాలమున మరల మ నగృహమునకు రాఁగలము. ఇంటియొక్క ప్రతిరూపము చిత్తమున లేనిచో, మనయిల్లేదో తెలిసికొననేరక మనయింటికి మరల రాఁజాలము. మనము మనయింటిప్రక్కనే నడచుచున్నను, నది మనయిల్లను ప్రత్యభిజ్ఞమనకు లేకపోవుట వలన స్వగృహమును బ్రవేశింపలేక పరగృహమును బ్రవేశించినవారమగుదుము! ప్రతిమలు పనికిరావనువారు స్మృతికి సాధనములైన మనోగత గృహాది ప్రతిమలుకూడఁ బనికిరావని యంగీకరింపవలసి వచ్చుటచే లోకవ్యవహారమునకంతకును భంగముఁ గలుగఁజేయువారు కాఁగలరు.

అనుమానము—మన మొక యరణ్యమునం బోవుచుఁ బర్వతమున ధూమమును జూచి, పూర్వము మనచేఁ జూడఁబడిన యగ్ని ధూమమును స్మరించి, పర్వతమందలి ధూమముతో నగ్నికిఁ గల సంబంధము సాహచరి

యచ్చటఁగూడ నగ్నియుండునని నిశ్చయించు చున్నాము. ధూమముండినపుడెల్ల వహ్నియుండుటనుగాంచి యుంటిమి. ఈపర్వతమున ధూమము కనఁబడుచున్నది, కావున నిచటఁ గూడ నవశ్యము వహ్నియుండును. ధూమమున్న సమయమునందెల్ల వహ్నియుండుటను మఱచితిమేని, నేతత్పర్వతమున నగ్ని యుండునని యూహింపఁ జాలముకదా. కావున స్మృతి లేనియెడల, ననుమితి సంభవింపదు. ప్రతిబింబము లేనిచో, స్మృతి జనియింపదు. కాఁబట్టి ప్రతిబింబము లేనిపక్షమున ననుమితియే లేకపోవును.

సంతానము—కొమరుండు తండ్రిరూపమునఁ బుట్టుచున్నవాఁడు. "ఆత్మైవపుత్త్రనామాఽసి" (తానేపుత్త్రుఁడనఁబరఁగు)అనిశ్రుతి. విగ్రహముయెడల ద్వేషముగలవారు పుత్త్రోత్పాదనము మానవలసి వచ్చును! తామే పితృరూపముల వెలయుచున్నవారు గావున నాత్మహత్యఁగూడఁ జేసికొనవలసి వచ్చును! మఱియు, నొక మంచి మొగగుఱ్ఱము నొక యాడుగుఱ్ఱమున కెదుట నిలువఁబెట్టినయెడలఁ, దక్కువ వెలగల మఱియొక మొగగుఱ్ఱమువలన నీ

గృహమున వసియించితిమో, దానిఛాయ మన చిత్తమునం బడుచున్నది. మనమీదినమునం బ్రాతఃకాలమున దూరముగా నెచ్చటికైనను బోయియున్నను, సాయంకాలమున మరల మనగృహమునకు రాఁగలము. ఇంటియొక్క ప్రతిరూపము చిత్రమున లేనిచో, మనయిల్లేదో తెలిసికొననేరక మనయింటికి మరల రాఁజాలము. మనము మనయింటిప్రక్కనే నడచుచున్నను, నది మనయిల్లను ప్రత్యభిజ్ఞ మనకు లేకపోవుటవలన స్వగృహమును బ్రవేశింపలేక పరగృహమును బ్రవేశించినవారమగుదుము! ప్రతిమలు పనికిరావనువారు స్మృతికి సాధనములైన మనోగత గృహాది ప్రతిమలుకూడఁ బనికిరావని యంగీకరింపవలసి వచ్చుటచే లోకవ్యవహారమునకంతకును భంగముఁ గలుగఁజేయువారు కాఁగలరు.

అనుమానము — మన మొక యరణ్యమునం బోవుచుఁ నొకపర్వతమున ధూమమును జూచి, పూర్వము మనచేఁ జూడఁబడిన యగ్నిని ధూమమును స్మరించి, పర్వతమందలి ధూమముతో నగ్నికిఁ గల సంబంధమును [illegible]

యచ్చటఁగూడ నగ్నియుండునని నిశ్చయించు చున్నాము. ధూమముండినపుడెల్ల వహ్నియుం డుటనుగాంచి యుంటిమి. ఈపర్వతమున ధూమము కనఁబడుచున్నది, కావున నిచటఁ గూడ నవశ్యము వహ్నియుండును. ధూమమున్న న మయమునందెల్ల వహ్నియుండుటను మఱచితి మేని, నేతత్పర్వతమున నగ్ని యుండునని యూహింపఁ జాలముకదా. కావున స్మృతి లేనియెడ ల, ననుమితి సంభవింపదు. ప్రతిబింబము లేని చో, స్మృతి జనియింపదు. కాఁబట్టి ప్రతిబింబ ము లేనిపక్షమున ననుమితియే లేకపోవును.

సంతానము.—కొమరుండు తండ్రిస్వభావ మునఁ బుట్టుచున్నవాఁడు. "ఆత్మైవపుత్రనామాఽసి" (తానేపుత్రుఁడనఁబరఁగు)అనిశ్రుతి. విగ్రహముయెడల ద్వేషముగలవారు పుత్రో త్పాదనము మానవలసి వచ్చును! తామే పితృ రూపముల వెలయుచున్నవారు గావున నాత్మ హత్యఁగూడఁ జేసికొనవలసి వచ్చును! మఱి యు, నొక మంచి మొగగుఱ్ఱము నొక యాఁడు గుఱ్ఱమున కెదుట నిలువఁబెట్టినయెడలఁ, దక్కు వ వెలగల మఱియొక మొగగుఱ్ఱమువలన నీ

యాఁదుగుఱ్ఱమునకుఁ బుట్టిన పిల్ల తల్లిముందట నున్న మొగగుఱ్ఱమునే పోలియుండునని కొందఱు చెప్పుచున్నారు. అట్లైనచో, విగ్రహముల శక్తి తెలియఁబడుటలేదా?

అలంకారములు—ముఖము చంద్రుఁడను నప్పుడు స్మృతిపథముననున్న చంద్రుఁడు మాత్రమే పరామర్శింపఁ బడుటలేదా? మఱియు, నొకటి బింబమును మఱియొకటి ప్రతిబింబమును నై యొప్పుటయే యౌపమ్యమునకుఁ బీజమని నుడువవచ్చును. కావునఁ బ్రతిబింబములను దృణీకరించు వారలలంకారముల నేల వాడవలెను? ఆంగ్లభాషయందలంకారములు Figures of Speech (భాషాప్రతిమలు) అనఁబడుచున్నవి. భాషకుఁ బ్రతిమలుండనోపుఁగాని, పరమేశ్వరునకుఁ బ్రతిమలుకూడవు కాఁబోలు!

ప్రతినిధులు—రాజు స్థానమున మఱియొక పురుషుఁడు వ్యవహరించును. ప్రజలకుఁ గూడఁ బ్రతినిధులుగలరు. ఈశ్వరుని మాత్రమే పూజింపవలయుననియు, నాతనికి మాఱుగా మఱియే వస్తువును బూజింపవలదనియు, ఘోషించువారు రాజాదుల ప్రతినిధులను రాజాదు

లవలె గౌరవించుట యెట్లుపొసగును ?

ప్రతిధ్వని—కొన్ని స్థలములందొకధ్వని మఱియొక ధ్వనిఁ బుట్టించును. కొన్ని తావులఁ బ్రతిధ్వనికిఁ బ్రతిధ్వని చెలంగును.

ప్రతిబింబము— ముఖమద్దమునఁ బ్రతిఫలించును. ఒకదర్పణమున కభిముఖముగా మఱియొక దర్పణమునుంచిన మొదలఁ బ్రతిబింబమునకుఁ బ్రతిబింబము చొప్పున దర్పణ పరంపర కానవచ్చెడిని.

ఛాయ —ఛాయవలన గ్రహణములు గలుగునని కొందఱు చెప్పుచున్నారు. భూమి మున్నగు గొప్పవస్తువులకే నీడగలదు; పిపీలికాదులకును గలదు. మనమేమిచేయుచున్నను, నది మనతోడనే యుండును; మనము పాఱిపోయినను నది మనలను వెంబడించుచుండును. కాంతిగలచోట ముఖమద్దమునఁ బ్రతిఫలించి ప్రతిబింబ మనఁబడుచున్నది భూతలమునఁ బడి నీడయనఁబడుచున్నది. బింబమైన ముఖముయొక్క యాకృతి ననుకరించునదియే గావున నీడయుఁ బ్రతిబింబ మనఁదగు.

ఇట్లు, ప్రతిమల నొల్లనివారు, ప్రతిబిం

బములనొల్లనివారు గావున, లోకవ్యవహారమంతయును లోపింపఁజేసిన వారగుదురు!

## సంయమస్థానములు.

ప్రతిమలు కొన్ని స్థూలములు, కొన్ని సూక్ష్మములు. భరతఖండమునఁ బార్థివలింగములు, జలలింగములు, జ్యోతిర్లింగములు, వాయులింగములు, నాకాశలింగములు వెలసినవి. వీనిలో మొదటివి మిక్కిలి స్థూలములు, తుదివి కడు సూక్ష్మములు, ఈయైదు విధములైన వానిలోఁ బార్థివలింగములకంటె జలలింగములు, జలలింగములకంటె జ్యోతిర్లింగములు, జ్యోతిర్లింగములకంటె వాయులింగములు, వాయులింగములకంటె నాకాశలింగములును, సూక్ష్మతరములు వాక్కును బ్రహ్మముగా నుపాసింపవచ్చును—"వాచంబ్రహ్మేత్యుపాసీత". మనస్సు బ్రహ్మముగా ధ్యానింపఁబడును—"మనోబ్రహ్మేత్యుపాసీత". కడపట నాత్మ పరమాత్మ యని భావింపవలయును. ఇట్లు, స్థూలపదార్థోపాసన మలవడిన కొలఁది సూక్ష్మపదార్థోపాసన నభ్యసింపనగు. ఉపాసకుని సామర్థ్యమునుబట్టి

యుపాసింపఁదగిన వస్తువు నిర్ణయింపఁబడు. జనులలో ననేకులు స్థూలవిషయములు మాత్రమే గ్రహింపఁగలరు గావున మనదేశమున స్థూల విగ్రహములే పెక్కులు ప్రతిష్ఠింపఁ బడియున్నవి. స్థూలమును జూచుటకు శక్తి లేనివారు సూక్ష్మమును జూడఁజాలరు గావున సూక్ష్మోపాసనము వారికిఁ బనికిరాదు. శ్రీరామానందులు మణిప్రభయను గ్రంథమున నీరీతిగా నుడివియున్నారు—

"నహి స్థూలమసాక్షాత్కృత్య సూక్ష్మం సాక్షాత్కర్తుం శక్యమితి భావః"

(స్థూలమును దర్శింపకయే సూక్ష్మమును దర్శించుట శక్యముగాదు.)

శ్రీపతంజలియోగ శాస్త్రమున నీవిషయమిట్లు నిర్ధారించియున్నాఁడు (పా ౩-సూ౬)-

"తస్యభూమిషు వినియోగః"

(అనంతరభూములందు సంయమమునకు వినియోగము కర్తవ్యము)

శ్రీ వాచస్పతి మిశ్రులు ధ్యానక్రమమును బోధించు పౌరాణిక శ్లోకముల నుదాహరించెను. ఎట్లన—

"మూర్తం భగవతో రూపం సర్వోపాశ్రయనిస్పృహం।
ఏషవై ధారణాక్షేయా యచ్చిత్తం తత్రధార్యతే॥"

భగవంతుఁడు సాకారుఁడు నిరాకారుఁడునగు. మొదట సాకారునియందును పిమ్మట నిరాకారుని యందును చిత్తమును నిలుపవలయును. ఇట్లొక విషయమందు నిశ్చలముగా మనంబు నుంచుటయే ధారణయనఁబడు. ఇట్టి ధారణయెప్పుడు పరిపక్వమైనదన —

"తావద్యావద్దృఢీభూతా తత్రైవ నృపధారణా...
నాపయాతి యదా చిత్తం సిద్ధాంమన్యేత తాంతదా"

(ఓనృపుఁడా, యొకఁడు పాసనయందు మగ్నుఁడైనను నితర వ్యాపారములందు వేనియందైన వ్యాపృతుఁడైనను, నాతని చిత్తము లక్ష్యమునందు మాత్రమే దృఢముగా నిలచి యన్యవిషయములకుఁ బాఱిపోవనిచో ధారణ సాఫల్యము నందినదని యెఱుంగునది)

ఆయుధములు, భూషణములు, మున్నగువానితో శోభించుచున్న భగవంతుని యుపాసనము ముందు కర్తవ్యము. అనంతరము సూక్ష్మోపాసనము కార్యము. కావున శ్రీవాచస్పతిమిశ్రు లిట్లానతిచ్చియున్నారు—

"స్థూలవిషయం సంప్రాప్తి సిద్ధాసనత్వాం, పురాణేతత్తదాయుధ భూషణాపనయేన స్వాత్మ్యవిషయః సమాధిరవతారితః"

(స్థూలవిషయములందు సమాధి సిద్ధించినపిమ్మట నాయా యాయుధములును భూషణములును విడువఁబడి కేవల స్వరూపమందు సమాధి పురాణమునఁ బ్రదర్శింపఁ బడుఘున్నది)

ఈ శ్లోకమున శంఖాది రహితమైనరూపము నిరూపింపఁబడుచున్నది—

"తతశ్శంఖగదాచక్రశార్ఙ్గాది రహితంబుధః।
చింతయేత్ భగవద్రూపం ప్రశాంతం సాక్షసూత్రకం"॥

(పిమ్మట శంఖగదాచక్ర శార్ఙ్గాది విహీనమైనట్టియు, శాంతమైనట్టియు, భగవద్రూపమును బుధుఁడు ధ్యానింపవలయును.)

అనంతరము కిరీటాది భూషణములు విసర్జింపఁ బడుచున్నవి—

"యదా చ ధారణా తస్మిన్నవస్థానవతీతతః।
కిరీటకేయూరముఖైర్భూషణై రహితం స్మరేత్॥"

(ఆయుధరహితమై ప్రశాంతమైనరూపమునందు ధారణాస్థైర్యముఁ జెందినప్పుడు, కిరీటకేయూరాది భూషణములు లేని పరమాత్మను స్మరింపనగు)

ఇప్పుడద్వైతభావనకు దారి చూపఁబడు చున్నది—

"తదా వికారయుతం దేవం, సోహంచేతి పునర్బుధః।
తర్యాత్తత్త్వో ధ్యాయామితి ప్రిణిధానపరో భవేత్॥"

(ఆయుధాలంకార విహీనమైన రూపమునఁ జిత్తము నిలచినపిమ్మట నేకావయవుఁడగు దేవుని ధ్యానింపవలయు. తరువాత వాఁడే నేనను భావన సేయునది. తుదకు నేనను బుద్ధిమాత్రమే మిగులునట్లు ధ్యానమున నిమగ్నుఁడు కావలయు)

ఈ విషయమును శ్రీ నాగేశభట్టు తన యోగసూత్రవృత్తి యందిటుల సంగ్రహించి యున్నాఁడు—

"సభూషణ సాయుధ చతుర్భుజమూర్తా సమాధౌసిద్ధే అయుధపరిత్యాగేన, తస్యాపిసిద్ధా భూషణరహితే, తతఃసోహమితి"

శ్రీ వాచస్పతి మిశ్రులీ యుపాసనయొక్క క్రమము నిటులఁ జూపియున్నారు—

"స్థూలవిషయే సవితర్క సమాధౌ వశీకృతే సంయమేన, సంయమస్య అవిజితేనిర్వితర్క విని యోగః తస్మిన్నపివశీకృతే, సవిచారేవినియోగః ఏతం నిర్విచారేవినియోగః"

(స్థూలరూపము లక్ష్యముగాఁ గల్గినట్టియు వితర్కముతోఁ గూడినట్టియు సమాధి సంయమముచే స్వాధీనము చేసికొనఁబడిన పిదప నింకను స్వాధీనముగాని నిర్వితర్కమందు సంయమము యొక్క వినియోగ మావశ్యకము. అదికూడ వశీకృతమైనచో, సవిచారమందు వినియోగము. అదికూడ సాధింపఁబడినయెడల, నిర్విచార స్వరూపమందు సంయమము వినియోగింపఁ బడవలయును)

ధారణ, ధ్యానము, సమాధి, యను నీ మూఁడును నేకవిషయమందే సమావేశమగు నెడల నీమూటికిని సంయమమను సంజ్ఞగలదు.

సమీపదేశమును జయింపకయే దూర దేశమును జయింపఁ జూచుటవలె, స్థూలోపాసన సిద్ధించుటకుఁ బూర్వమే సూక్ష్మోపాసనఁ బ్రారంభించుట నిష్ఫలమగును. కాఁబట్టి వాచస్పతి మిశ్రులిట్టుల వ్రాసియున్నారు—

"నహి శిలాహ్రదాద్గంగాం ప్రతిప్రస్థితః అప్రాప్య మేఘవనం గంగాం ప్రాప్నోతి"

(ఒకఁడు శిలాప్రాహ్రదమునుండి గంగానదికిఁ బయనమై మధ్యనున్న మేఘవనమును దాఁటకయే

పర్యవసానము. జ్ఞేయమగు బ్రహ్మము సూక్ష్మమగుటచే స్థూలములోఁ బ్రారంభము, సూక్ష్మమందుఁ బర్యవసానము.

నారదుఁడు కృష్ణుని యొద్దఁ గూర్చుని సంభాషణముఁ గావించి, పిదప నొక పక్షివలె నాకసమున కెగసి యదృశ్యుఁ డయ్యెను పక్షమున నీ యుపాసనకు నిదర్శనము లభించెడిని ఎట్లయనఁ గృష్ణుని చిత్తమప్పు డగోచరుఁడైన నారదునుండి మరలి స్వాత్మయందే విశ్రాంతినొందఁగలదు. ఒకపక్షి మనయొద్దనుండి వెడలు నెడల, నది దూరముగాఁ బోయినకొలఁది సూక్ష్మతరమగుచుఁ దుదకదృశ్యమగును, గాన మన దృష్టి పక్షినిఁక వెంబడించుటమాని వెనుకకు మరలి మనయందే నిల్చునుగదా.

ఇట్లు, సర్వేశ్వరాత్మ జ్ఞానమునకు సవిశేష దేవతా విగ్రహజ్ఞానము గావలయును.

## —అల్పబుద్ధులు—

ఉత్తరగీతా గ్రంథమునుండి కొందఱీ శ్లోకమును (అ. 3 శ్లో 7) బ్రదర్శించి, ప్రతిమార్చనము తెలివిలేమిని వెల్లడించుననియు,

తెలివిగలవారు ప్రతిమలను వర్జింప వలయుననియు, వాదించుచున్నారు—

"అగ్నిర్దేవో ద్విజాతీనాం, మునీనాంహృది దైవతం।
ప్రతిమాస్వల్పబుద్ధీనాం, సర్వత్రసమదర్శినాం॥"

(ద్విజులకగ్నియే దేవుఁడు. మునులకు హృదయ పుండరీకమున దైవతముగలదు. అల్పబుద్ధివారికి విగ్రహమే పరమేశ్వరుఁడు. సమదృష్టి గల జ్ఞానులకన్నచో, లోకము నందెల్ల నాతఁడున్నాఁడు)

'సర్వత్రవిదితాత్మనాం' అని పాఠాంతరము. ఈపద్యమునందలి స్వల్పబుద్ధులెందులకును బనికిరానివారనియు, నట్టివారిచేఁ జేయఁబడుటచే విగ్రహారాధను హేయమైనదని మన మూహింప వలయుననియుఁ, జెప్పరాదు. ఒక్క విగ్రహమును మాత్రమే బ్రహ్మమని భావించినవాఁడు మూఢుఁడైనచో, జగత్తును సర్వంబును బ్రహ్మమని తలంచు జ్ఞాని యెంతమూర్ఖుఁడో! మఱియు, 'బుద్ధిహీను లన్యుల సొమ్ము నపహరింతురు', 'బుద్ధిహీనులు ప్రతిమార్చనము సేయుదురు',—ఈ రెండు వాక్యములందలి భావము నొక్కటిగాదు. మొదటి దానియందు,

నిషేధమభిప్రేతము. రెండవదానియందున్, నిషే
ధము లేదు. ఆత్మజ్ఞానముకంటెఁ బ్రతిమార్చన
ము హీనమైనది; కాని, పరిత్యాజ్యమైనదిగాదు.
దానిని జ్ఞానులు పరిత్యజించినను జ్ఞానహీనులు
పరిత్యజింపఁ గూడదు. కావున, రెండవ వాక్య
ముచే జ్ఞానప్రాశస్త్యము మాత్రమే సూచింపఁ
బడుచున్నది. విగ్రహారాధకులు వివేకహీను
లుగారు. ఒకింత వివేకముగలవారు గావుననే
విగ్రహములందైనను భక్తిఁ జూపుచున్నారు;
వివేకము లేనివారైనచో, నాస్తికులుగా నుం
డియుందురు, పరధనముల నపహరించి యుం
దురు. ఎవ్వరు బుద్ధిహీనులనఁ, దమకధికారము
లేకపోయినను నిర్గుణోపాసనకు సిద్ధపడినవారు!
నిరాకార బ్రహ్మోపాసకులగు జ్ఞానులెంత తెలివిగల
వారో, సాకారోపాసకులైన యజ్ఞానులు నంత
తెలివితేఁ గలవారు, వారెట్లు కృతార్థులో, వీ
రును నట్లే కృతార్థులు. పక్షివలె నొక్కసారి
సౌధాగ్రభాగమును బొందఁజాలనివాఁడు సోపా
నక్రమము నవలంబించుచునేని, నాతఁడు నిందా
ర్హుఁడగునా?
మఱియు నీపద్యము పురుషులు నాలుగు తెఱంగులని

తెల్పుచున్నది. కొందఱు కర్మకుఁ, గొందఱు యోగమునకుఁ, గొందఱు భక్తికిఁ, గొందఱు జ్ఞానమునకును, నర్హతగలవారు. ఎవ్వరు కర్మాధికారులో వారలు ప్రతిమార్చనము మానిన మానుదురుగాక, కాని, వారు యథావిధిగా కర్మల ననుష్ఠించువారై యుండవలయు. యోగమున కర్హులు విగ్రహములను విసర్జింపనిండు; కాని, వారు యమ నియమాదులలోఁ బ్రకాశింప వలయు. జ్ఞానమార్గమునం దధికారము గలవారు విగ్రహారాధనము విడిచిన విడువనిండు; కాని, వారలు సాధనచతుష్టయ సంపన్నులరయి బ్రహ్మావలోకనముఁ జేయ వలసియున్నది. ఇప్పుడెవ్వరీ మూఁడు విధములయిన వారిలోను జేరరో, వారలకు భక్తిమార్గము మాత్రమే మిగిలియున్నది; అప్పుడు ప్రతిమార్చనము ముఖ్యముగా నున్నయది. కావున, నట్టివారి లలాటమున విగ్రహారాధనము విధాతచే వ్రాయఁబడియున్నది; అది వారి కిష్టముగుఁగాక, ఇష్టము గాకపోవుఁగాక! లోకములో నధికసంఖ్యాకు లీమార్గమునకు మాత్రమే యర్హులగుచున్నారు. ఏలయన వారలందఱును స్వల్పబుద్ధులు; మేము మహా

శయులమని ప్రగల్భవచనములు పల్కుటవలన నేమిలాభము?

అదియునుంగాక, ప్రతిమార్చన వలనఁ బాపము ప్రాప్తించుననిగాని, మఱియే యుపద్రవమైన నంభవించుననిగాని, యుత్తరగీతలం దెచ్చటనైనఁ దెల్పఁబడినదా? జ్ఞానము స్తుతింపఁబడుట సత్యము. కాని యందలియభిప్రాయము విగ్రహములు వినర్జనీయములనియా? అ. శ్లో 6 విగ్రహ వినర్జనమును విధించుచున్నదందు లేని,

"ఉల్కాహస్తో యథాకశ్చిద్ద్రవ్య మాలోక్యతాంత్యజేత్।
జ్ఞానేనజ్ఞేయ మాలోక్య పశ్చాత్ జ్ఞానం పరిత్యజేత్॥

(కొఱవి హస్తమునఁగల నరుఁడొకఁ డభిమత వస్తువును జూచినవాఁడై పిమ్మట నాకొఱవివలన కక్కఱలేదు గావున దాని నెట్లు విడిచిపెట్టునో, యట్లు జ్ఞానముచేత జ్ఞేయమైన బ్రహ్మమును దెలిసికొనినపిదప జ్ఞానమును విడిచి పెట్టవలెను. — అ 1 శ్లో 21) —

మొదలగు వాక్యముల ననువరించి వేదమును, జ్ఞానమార్గమును, వినర్జింపుఁడు. ఆత్మసాక్షాత్కారమునకుఁ బూర్వము వేదాదులావశ్యకములన్న యెడల, విగ్రహారాధనముకూడ

నోక యనన్తనలకు నావశ్యకమని గ్రహింపవలెను. కావుననే, గౌడపాదాచార్యులు "అ[illegible]ర్దేవా" (అ 3 శ్లో 7) అను శ్లోకము నీరీతిగా నవతరించి యున్నారు—

"యోగినః సర్వేభ్యో బ్రహ్మదర్శనమేవ ఇత్యేతత్ అధికారి భేదేనోపపాదయతి"

(యోగి కంతటను బ్రహ్మదృష్టియే యను విషయము నధికారి భేదముచేత నుపపాదించుచున్నాడు)

ఈశ్లోకమునం జెప్పంబడిన మార్గములు నాలుగును గనుకనే కర్మ, యోగ, భక్తి, జ్ఞానములం దభినివేశము గలవారికి యోగ్యము లగుచున్నవని తాత్పర్యము ఇది—

"తీర్థాని తోయపూర్ణాని. దేవాన్ పాషాణమృన్మయాన్।
యోగినో న ప్రపద్యంతే, ఆత్మధ్యానపరాయణాః॥"

(ఆత్మధ్యానపరులైన యోగులు జలములతో నిండిన తీర్థములను, రాయి మన్ను మొదలగు పదార్థములతో నిర్మింపంబడిన దేవతాప్రతిమలను సేవింపరు) (అ 8. శ్లో 6)

అను శ్లోకముయొక్క వ్యాఖ్యయందు స్పష్టమగుచున్నది—

“తీర్థస్నానాదినా దేవతాపూజాదినాచ అధ్యాత్మసమాధి సిద్ధే. పునస్తైః కిం ప్రయోజనమితి భావః”

(తీర్థస్నానాదికముచేతను దేవతాపూజాదికముచేతను నధ్యాత్మసమాధి సిద్ధించఁగా, మఱల తీర్థస్నానాద్యుపాయములతో నేమి ప్రయోజనమని భావము)

తీర్థస్నానాదు లధ్యాత్మసమాధికి సాధనములు గావున నధ్యాత్మసమాధి నపేక్షించువారు తీర్థాదులను సేవింపవలయునని తేలుచున్నది. ఆత్మసాక్షాత్కారపర్యంతము తీర్థయాత్రాదులను సేయుమని బోధించుశ్లోక మొకటి యుదాహరింపఁబడుచున్నది—

“అనంతకర్మ శౌచంచ, జపో యజ్ఞ స్తథైవచ। తీర్థయాత్రాభిగమనం, యావత్తత్త్వం న విందతి”—అ 3. శ్లో 42.

(ఒకఁడు బ్రహ్మభావంబు నెంతకాలమందకుండ నంతమునో, యంతదనుక వివిధకర్మలును, శౌచంబును, జపంబును, యజ్ఞంబును, తీర్థయాత్రాదిగమనంబును, గావలసియున్నవి)

దీనిని గౌడపాదు లిట్లు సంగ్రహించియున్నారు—

బ్రహ్మజ్ఞానపర్యంతం అనుష్ఠేయం, జ్ఞాతేతు సర్వం వ్యర్థం
(బ్రహ్మజ్ఞాన ముదయించుదాఁక కర్మాదులను ష్ఠేయములై యున్నవి. బ్రహ్మంబు దెలియఁబడిన పిమ్మట నివి యన్నియును నిష్ఫలంబు లగును)

కాఁబట్టి యజ్ఞానావస్థయందు విగ్రహారాధనము వలన లాభమే గలదు.

మఱియు, ద్విజులగ్నిని సేవించుచున్నారు. దానికి వినాశాదులు గావు బ్రహ్మంబు శాశ్వతమైనది, అగ్నియే బ్రహ్మంబుగాదు. కావున వీరు విగ్రహారాధకులు. యోగులు హృదయపరిచ్ఛిన్నమూర్తిని ధ్యానించుచున్నారు. బ్రహ్మము అనంతమైనది. హృద్గతమూర్తియే బ్రహ్మంబు కానేరదు; కావున వీరును విగ్రహారాధకులే. స్వల్పబుద్ధులు పాషాణాది ప్రతిమల నర్చించుచున్నారు ఇవి జాడ్యాది దోషములఁ గలిగియున్నవి. పరమేశ్వరు డనంత కళ్యాణ గుణోపేతుఁడు. ప్రతిమ యీశ్వరుఁడు కాదు. కావున వీరు విగ్రహారాధకులు. సమదృష్టిగల జ్ఞానులీ విశ్వమంతయును బ్రహ్మమయమని భావించి యానందించుచున్నారు. బ్రహ్మము

నిర్వికారమై నిరంజనమైనవస్తువు. విశ్వమే బ్రహ్మంబుగాదు. కావున వీరును విగ్రహారాధకులగుదురు. ఇట్లు కర్మమందును, యోగమందును, జ్ఞానమందును గూడ విగ్రహారాధనము న్యూతమై యున్నది, ఒక్క భక్తియందే కాదు; ప్రతిమలందు దేవతాబుద్ధిగలవారిని మాత్రమే పరిహసింపనేల?

మఱియుఁ బుణ్యాత్ములు కర్మలనాచరింప వలసివచ్చినప్పుడు, "మేముకర్మఠులముగాము, యోగులము" అని కర్మలబాసియుండి తొలఁగ వత్తురు. ప్రాణాయామాది యోగాంగముల నభ్యసింపనవసరము ప్రాప్తించినచో, "మేము యోగులముకాము. మాది జ్ఞానమార్గము" అని బొంకి యోగాభ్యాస క్లేశమునకు దూరముగా నుండఁగలరు. సర్వసంగపరిత్యాగాదులుగల జ్ఞానమార్గము ప్రదర్శింపఁబడిన యెడల, "మాకు జ్ఞానముతో నేమిపని? మేము యోగశాస్త్రాగరిష్ఠులము" అని తీక్ష్ణ జ్ఞానాగ్నిబాధకు వశులుగాకుండ నుండఁజాలియున్నారు. ప్రతిమార్చనము విధింపఁబడిన సమయంబున, "మేము స్వల్పబుద్ధిగలవారము కానేరము. లోకమంత

యును గూడ బ్రహ్మం బగుచున్నది.” అని దేవతాసేవ దర్శనములు నహంబ్రహ్మాస్మియను చుందురు. ఈరీతిగా నొకమార్గము మాటవచ్చి నప్పుడు మఱియొక మార్గ మవలంబింపఁ బడుచున్నది. కాని, నిక్కముగా వీరికి నొక్క మార్గమే గలదు, వ్యాకులమార్గము; వీరలొందు గలరు. నిదియ! జ్ఞానధురీణులైన నిట్టివారే గదా? వీరికేల తుచ్ఛమైన ప్రతిమార్చనంబు?

## నివేదన.

కొందఱిట్టి ప్రశ్నలు వేయుచున్నారు:—
“ఈశ్వరున కాఁకలియున్నదా? ఆతఁడుచలిచేత వడఁకుచున్నాఁడా?” వీనికి సమాధానమిది:—

(1) అన్నము, వస్త్రము, మొదలగునవి సమర్పించుటవలనఁ బరమేశ్వరునకు మన ముపకారముఁ జేసినవారమైనను గాకపోయినను, మనకే లాభమును సంపాదించిన వారమగుదుము. అట్టి వస్తువులాతని కక్కఱలేక పోవచ్చును. కాని, యావిషయ మాలోచించుట మన పనిగాదు. మన మొనరించిన పరిచర్య కాతఁడు సంతసించి మనలను రక్షించును. ఒక

పేదవాఁడైన కర్షకుఁడు రాజునకొక ఫలము ని
చ్చెను. ఐశ్వర్య సంపన్నుఁడైన భూమీశ్వరున
కీ యల్పుఁడు ఫలము నొసంగనియెడల నదిలేక
పోయినదా? సర్వేశ్వరున కట్టిలోపమును లేదు
గాన నాతని కెట్టి కానుకయు నర్పింపఁగూడదను
వారు రాజునకు దారిద్ర్యము లేనందున నాతని
కిఁ దృణమైన నొసఁగరాదని చెప్పవలసివచ్చును.
ఇది సరియైనది కాదు. కావునఁ బరమేశ్వరునకుఁ
బత్రపుష్పాదులను సమర్పించి భక్తిని వెల్లడిం
చుట మనకుఁ దగియున్నది.

(౨) సమర్పితమైన పదార్థము నాతఁడు
స్వీకరించినను స్వీకరింపకున్నను, సమర్పించుట
మాత్రము మనకృత్యమై యున్నది. ఇఁక, స్వీ
కరింతునని భగవంతుఁడే వాగ్దానము జేసియుం
డ, సమర్పణము నిష్ఫలమగునని శంకింపనేల?
శ్రీకృష్ణుఁడిట్లు వచించియుండలేదా? (భగవ
ద్గీ. 9-26)—

"పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి।
తదహం భక్త్యుపహృతమశ్నామి ప్రయతాత్మనః॥"

(ఆకుగాని, పూవుగాని, నీరుగాని, యెవ్వఁడేని
నాకు భక్తితో సమర్పించునెడల, భక్తిపూర్వ

కముగా నొసంగఁబడిన యోగసమాహిత చిత్తుని
పదార్థము నత్యంతాదరముతో నేను భుజించు
వాఁడను)

ఈశ్లోకమున భక్త్యయను పదము రెండు
మాఱు లుపయోగింపఁ బడుటచే, సమర్పితమైన వస్తువుకంటె సమర్పకుని భక్తి యెక్కుడు
విలువగలదని సూచింపఁబడినది. శ్రీకృష్ణుఁడు తాము
చేయు సత్కారమున కెంతయు సంతసింపఁగల
నని తానే ఘోషించుచుండ, నాతఁడు సంతో
షింపనేరఁడని చెప్పుట సత్యమును బొంకింపదా?
"నాకడుపు నిండినది, నాకుఁ దృప్తి కలిగినది"
యని యొకఁడు చెప్పుచున్నను "నీకడుపు నిండ
దు. నీకుఁ గడుపేలేదు. నీకుఁదృప్తి లేదు. కావు
న మేము నీకేమియు నీయనక్కఱలేదు" అని
చెప్పుట యెట్లున్నది?

(౩) ఈశ్వర పాదపద్మములకడఁ బెట్టఁ
బడిన పదార్థము ప్రసాదమగును. నారికేళము
నకు నారికేళత్వము నశించును. అన్నమున క
న్నత్వము బోవును. స్థూలమైన నారికేళాదికము
సూక్ష్మమైన ప్రసాదముగాఁ, బరమేశ్వరుని దయ
గాఁ, బరిణమించెడిని. ఇట్లగుట మనశాస్త్రము

లందున్న యపుడది నారికేళాదికమే యైయుండి
నను, సర్వేశ్వరునకీఁబడి వెండియు మనచే గ్ర
హింపఁబడిన సమయంబున నయ్యది నారికేళాది
కము గాక, మనదైన భగవంతునికిఁ గల్గినదయ
యై మనకు లభించుచున్నది. ఇక్కడ స్థూలము
సూక్ష్మమగుచున్నది. అట్లే సూక్ష్మము స్థూ
లముగా మారవచ్చును. ఎట్లన, నొక బాలుఁ
డు విష్ణుప్రసాద నామమునొందియున్నాఁడు.
మఱియొకనికి శివప్రసాద నామధేయ మొసఁగఁ
బడుచున్నది; విష్ణుని ప్రసాదము (కటాక్షము)
బాలుఁడై యవతరించినది. ఈతఁడు విష్ణుదత్తు
డు. శివుని ప్రసాదము మఱియొక బాలుఁడై
జనించినది. ఈతఁడు శివదత్తుఁడు. కావున సూ
క్ష్మమైన ప్రసాదము స్థూలమైన యర్భకుని స్వరూ
పమును దాల్చినదని చెప్పవచ్చును. క్రైస్తవు
లలో రోమను కేథలిక్కులు వారు కొంత పిష్ట
పదార్థమును మధువిశేషమును దెచ్చి, మొదటి
నిజముగాఁ గ్రీస్తుయొక్క మాంసమగుచున్న
దనియు రెండవది యాతని రక్తముగా మా
రుచున్నదనియు నమ్మి, వానిని సేవించుచు
న్నారు. ఇది స్థూలము స్థూలమగుట. ఈ

శ్వరునకు నివేదింపఁబడిన నారికేళఫలము వాస్తవముగా నారికేళఫలము గాదనియు, నయ్యది పరమేశ్వరుని ప్రసాదమే (కటాక్షమే) యగుచున్నదనియు విశ్వసించువారిఁ బరిహసింపనేల?

(4) ఈశ్వరుఁడు తినఁగలఁడాయనఁ, దినఁగలఁడనియే యెఱుంగునది. ఆతనికి శరీరముగలదాయన, నీవిశ్వమంతయు నాతనికి శరీరమనియు, నచ్చటనే యది జీర్ణమగుచున్నదనియు సమాధానము. మఱియు నీశ్వరుఁడు దాని నాస్వాదించుట లేదని యెట్లు చెప్పఁగలరు? తినఁబడిన యెడల పదార్థమునకు బరువు తగ్గవలయుఁగదాయని యాక్షేపించెదరేమో. తగిన తులయందుఁ దూచవలయుఁగదా? మఱియు సామాన్య ప్రాణులచే దినఁబడిన పదార్థమునకు లఘుత్వము గలుగును; ఈశ్వరునిచే భుజింపఁబడిన దానికిగౌరవము హెచ్చును. ఎవ్వఁడు దినునో వాఁడే దానిలాభమందుట లోకములోఁ జూడఁబడుచున్నది; కాని, పరమేశ్వరుఁడు తినువాఁడు, భక్తులు కృతార్థులగువారు. నివేదితానివేదిత వస్తువులకిట్టి భేదమున్నది. విశ్వరూపమును ధరించిన పరమేశ్వరునకిది పొసఁగుఁగాక, ఒక చిన్న

ప్రతిమ కిది సంభవమగునా?'-అని యొక ప్రశ్న రావచ్చును. ప్రతిమ తినుట గాని తినక పోవుట గాని భక్తుని భక్తి విశేషమును బట్టి యుండునని యు, ప్రతిమలు కొన్ని తినుచుండె ననుటకు ప్రమాణములు గలవనియు, దానికిఁ బ్రత్యుత్తరంబు.

(౫) మఱియు, మనకిష్టమైన పదార్థము ను మనకిష్టమైన వారికి సమర్పించుట స్వభావ మువలనఁ గలుగుచున్నది. ద్వారమున కెదుట సంభృతమైన వస్తువు కనఁబడినప్పుడు మాత స్నేహముగా లోనికిఁ బోయి తననుతు నెత్తికొని వచ్చి వానిఁ జూపించును. కాఁబట్టియే శ్రీ కాళిదాసు చేసిన యభిజ్ఞాన శాకుంతలము (4-8) న నిట్లు వర్ణించియున్నాఁడు.

పాతుం న ప్రథమం వ్యవస్యతి జలం యుష్మాస్వపీతేషు యా ''

(ఏ దయామయి మీకు మొదట ద్రావినఁగాని జలంబును ద్రావుటకుఁ బ్రయత్నింపదో, యట్టి శకుంతల యిప్పుడు మిమ్ములను వదలి భర్తృగృహమునకు బోవుచున్నది. అందఱిచేతను ననుమోదింపఁగఁబడుఁగాక.)

### అనుగ్రహహేతుత్వము.

కొందఱికతిగా నాక్షేపించుచున్నారు-- విగ్రహము భగవంతునిగా భావించి పూజించుటవలన నతఁడు మనపైఁ గోపమునహించును.. ఈశ్వరుఁడు పరిపూర్ణుఁడు; విగ్రహముపరిచ్ఛిన్నము. ఈశ్వరుఁడు చైతన్యము గలవాఁడు; విగ్రహమచేతనమైనది. అసహ్యమైన రూపమున నొక ప్రతిమనుజేసి దానిని రాజుగా నెంచి యుత్సవాదులు చేయుటవలన రాజునకు మనయెడలఁ గ్రోధముత్పన్నము కాదా? కాని యీ యాక్షేపంబు నిలువదు; ఏలయన:—

(1) ఈశ్వరుఁడు మానవునివలె గర్వమునకు వశుఁడగువాఁడు గాఁడు. 'పాప మీ భక్తుఁడు నాసత్యమైన స్వరూపంబు నెఱుంగలేక మృన్మయంబగు విగ్రహమే నేనని తలంచి దాని నారాధించుచున్నవాఁడు. వీని భక్తికి సంతసించితిని; వీనియందు నాకు జాలి కలుగుచున్నది; వీనికి నా నిజస్వరూపంబుఁ బ్రదర్శించెదను.' అని దయామయుఁడగు సర్వేశుఁడు విచారించి భక్తునికి శ్రేయోమార్గమును

గల్పించును. కావున బ్రతిమాలిన దయను బుట్టించును, గోపమునుగాదు. మఱియు, రాజునకుఁ గోపము వచ్చునని యట నరిగాదు; ఏలయన రాజులు కొందఱు గోపితులయినను, సద్బుద్ధిగల భూపాలురు గోపంబు నందరు.

(2) ఈశ్వరుఁడు సర్వజ్ఞుఁడు గావున విగ్రహారాధకుని హృదయము నెఱుంగఁ గలఁడు. విగ్రహారాధన మీశ్వరుని సత్కరించుటకు మాత్రమే జరుగుచున్నదనియు, నాతని బరిహాసించుటకుఁ గాదనియు, నాతఁ డెఱింగిన వాఁడై యారాధకునిఁ గటాక్షించును. ఆరాధనయొక్క పద్ధతి నంతగాఁ బాటింపఁడు. పృథ్వీపతియైనను బ్రజల భావము నెఱుంగఁగలవాఁడయినచో, 'ఇతఁడే మామహారాజు' అని ప్రజలొక హేయమైన ప్రతిమకుఁ జేయు సమ్మానమునకుఁ గోపింపఁడు. మానవుఁడగు రాజు కించిజ్ఞుఁడు గావున నొకప్పుడు తనవారి యాశయమును గనుఁగొనలేక, వారు తనదైన గౌరవము గలవార మునను లాఘవముఁ జూపుచున్నారని భ్రమించి, వారిని బాధింపవచ్చును. కాని, యీశ్వరుఁడు సర్వము నెఱింగినవాఁడగుటచే నిట్టి భ్ర

మకుఁ జిక్కువాఁడు కాఁడు మఱియు, న్యాయస్థానమునందు, మన కార్యము మాత్రమేగాక, మనము దాని నెట్టి యుద్దేశముతోఁ జేసి యుంటిమో యదికూడ గమనింపఁబడుచున్నది. ఒకఁడు వీథిలోఁబడిపోయినప్పుడు సమీపముననున్న మఱియొకఁడు జలంబును దట్టముగా వానిముఖమునఁ గొట్టిన, నాజలంబువలన శ్వాసమునిరోధింపఁబడి వాఁడు మృతినందిన యెడల, నుపకారముఁ జేయఁ దలఁచి యపకారముఁ గావించిన వానికిఁ గఠినశిక్ష విధింపఁబడుచున్నదా ? కావున విగ్రహ మీశ్వరధిక్కారార్థమైనచో, విగ్రహారాధకుఁడు దండార్హుఁడగు; అది సత్కారమునకై కల్పింపఁ బడినప్పుడు, వాఁడనుగ్రహమునకుఁ బాత్రుఁడగు. శిశుపాలుఁడు పళ్లెరమును భగవంతుఁడగు శ్రీకృష్ణునికి విడిచెను; ప్రతిమార్చకులును విడుచుచున్నారు. శిశుపాలుని హృదయ మొకటి; ప్రతిమార్చకుల హృదయము మఱియొకటి: కాఁబట్టి ఫలములు భిన్నములు.

(3) సైనికులు పతాకమును బహూకరించుచున్నారు. అది శాసింపఁగలదా? యుద్ధ

రంగమునకుఁగాని, గృహమునకుఁగాని, సంపద్గ లదా? ఆహారాదులను సమకూర్పఁ జాలునా? జయించినవారికి బహుమానంబును, మృతినొం దినవారి కంత్య సంస్కారంబును, నొసంగ నోపునా? మఱియు మన మొకని చిత్రపటము ను గొప్ప యుత్సవముతోఁ బట్టణమునఁ ద్రిప్పుచు న్నారము. అందు దీపములు, మేళములు, తాళ ములు మున్నగువాని ననుభవించుటకు సమర్థ మైయున్నదా? అయినను సైనికులు పతాకము ను గౌరవించుచున్నారు. దానికొఱకుఁ దమప్రా ణములనైనఁ గోల్పోవుచున్నారు. ప్రజలుచిత్ర పటమును వైభవముతో నగరమునఁ ద్రిప్పుచు న్నారు. అటులనే విగ్రహారాధకులును విగ్ర హమును దమ శిరమునఁదాల్చి కృతార్థులగు చున్నారు. పతాకాదులు సత్కారమును గ్ర హింపఁగలవా, గ్రహింపలేవాయను మీమాం సకవసరములేదు. గ్రహించినను గ్రహింపకు న్నను, నయ్యవి మనహృదయములందంతో త్సాహంబు నుద్భవింపఁ జేసి, కార్యదీక్షను బుట్టించును.

(4) అసాధ్యమైనది విధింపఁబడదు. శిరీ

పు కుసుమముతో వజ్రమును భేదించుట, వింధ్య పర్వతమును సాగరమునఁ దేలునట్లు చేయుట, మొదలయిన పనులు మనకు సాధింపఁబడుట లేదు. మిక్కిలి కష్టముగా సాధింపఁదగిన కార్యములును ధ్యేయములు కానేరవు. సముద్రము నీఁది యావలిగట్టును బొందుట సాధింపఁదగిన కార్యము గాదు. ఆకాశగమనము నట్టిదే. అట్లనే నిరాకార బ్రహ్మంబు ద్వైతబుద్ధిగలవారికి లొంగునది కాదు గావున నుపాసనయందు నిరాకారము మాత్రమే యుపయోగింపఁబడవలయునను నియమమున కవకాశము లేదు

ఆక్షేపము—సగుణంబు సాధ్యమగును గాన సగుణోపాసన యందు విధింపఁబడు; విగ్రహంబు నిషేధింపఁబడును.

సమాధానము—రూపరహితమైన సగుణబ్రహ్మంబు నిర్గుణబ్రహ్మమంత కష్టమైనది గాకపోయినను, రూపవిశిష్టమైన సగుణ ప్రతిమాదకముకంటెఁ గష్టతరమగుటవలనఁ, బామర జనంబులకు సాధింపఁబడదు. 'ఓ దయామయుఁడా!' అని పిల్చుట సుకరము; భావము సులభమైనదిగాదు. ఇట్లు, రూపరహితోపాసన

విధింపఁబడలేదు గావున రూపసహితోపాసన వంకఁ బ్రత్యవాయంబు కలుగదు; ప్రత్యవా యంబు లేక పోవుటచేత, సాకారోపాసన మీశ్వరుని కోపంబునకుఁ గారణంబుగాదు.

## ఈశ్వర సాదృశ్యము.

ఈశ్వర ప్రతినిధి నారాధించుటవలన నీశ్వరునకుఁ బ్రీతి కలుగును. రాజప్రతినిధిని గౌరవించుట రాజును గౌరవించుట యగును. అట్టి ప్రతినిధిచేతనుఁడు మాత్రమే యైయుండవలయునను నియమము లేదు. భరతుఁడు శ్రీ రాముని పాదుకలను బీఠమున నిడి రాముని యట్లు పూజించెను. రాముఁడు భరతునిభక్తికి సంతోషింపలేదా? కావున విగ్రహము చైతన్యము లేనిదైనను నారాధనకు యోగ్యమగుచున్నది. మఱియు, మహేశ్వరుఁడు స్థాణుశబ్ద వాచ్యుఁడగుటవలన్ చలనములేని ప్రతిమ యాతనికిఁ బ్రతినిధిగా నుండుట కర్హమగుచున్నది. ఆతఁడు నిశ్చలుఁడు; ప్రతిమయునట్టిదే; అను రూప్యము లేదనుటతప్పు.

ఆక్షేపము—ఒక వృత్తముగాని, పర్వ

తముగాని, నిశ్చలమై యుండును. కాని, చైత
న్య శూన్యమగుటవలన మనప్రార్థన నది గ్ర
గ్రహింపఁజాలదు. అటులనే పరమేశ్వరునకును
పాషాణ విగ్రహమునకును నైశ్చల్యము సమా
నధర్మమయి యున్నను చైతన్యాంశమున వైధ
ర్మ్య ముండుటవలన, విగ్రహమునకు గ్ర
హీతృత్వంబు నేమిం జేసి యనుగ్రాహకత్వం
బు లేదు.

సమాధానము— ఈశ్వరుఁడు భక్తుల
ననుగ్రహించువాఁ డయినచోఁ జాంచల్యము
గలవాఁ డగును. ఏలయన, ననుగ్రహించుట
యొక్క వ్యాపారము. చలనము లేని వ్యాపార
ములేదు. అచలుఁడగు మహేశ్వరుఁడు శిష్టరక్ష
ణాది కార్యంబుల నెట్లు నిర్వహింపఁగలఁడు?
కలఁడేని, అచలమగు విగ్రహంబుం నట్టి పను
లను జేయఁగలదు. అచలత్వంబునకును భక్త
సంరక్షణాది కర్తృత్వంబునకును శాస్త్రప్రమా
ణమువలన విరోధము లేదంటిరేని, విగ్రహ
విషయంబునను విరోధాభావంబు గ్రహింపుఁడు.
మీ యీశ్వరుఁడు కదలకయే కార్యములను
సాధించును. మా విగ్రహమును నటులనే ప్రస

తించును. మీయీశ్వరుఁడు సమయము వచ్చి నప్పుడు స్పందము నొందుసేసి, మావిగ్రహం బును నట్లు చేయఁగలఁడని నమ్ముఁడు. మఱియు, మునులు తొల్లి బ్రహ్మతత్త్వంబు నుపదేశింపు మని యీశ్వరునిఁ బ్రార్థింప నాతఁడు దక్షిణామూ ర్తిరూపమున నవతరించి మౌనముద్రచేతనే వారికిఁ దత్త్వోపదేశంబుఁ జేసెనని పురాణముల వలనఁ దెలియుచున్నది. ఆతఁడు "మౌనవ్యా ఖ్యా ప్రకటిత పరబ్రహ్మతత్త్వః" (మౌనవ్యా ఖ్యచేఁ బరబ్రహ్మ స్వరూపంబును బ్రకటించిన వాఁడు) అనఁబడుచున్నాఁడు. "స్వాత్మానం ప్రకటీకరోతి భజతాం యోముద్రయా భద్ర యా" (మంగళకరమైన మౌనముద్రచే నాత్మ యాథాత్మ్యమును స్పష్టముఁ జేయుచున్నవాఁ డు) అని శ్రీ శంకరాచార్యులు దక్షిణామూ ర్తిని వర్ణించియున్నారు. అట్టి నిశ్చలమైన బ్ర హ్మవస్తువును బ్రకటించుటకుఁ బాషాణాది ప్ర తిమలు సమర్థములు కావా? మఱియుఁ, బ్రతి మలందుఁ జైతన్యము పూర్తిగా లేదనవలదు; ఏలయనఁ, జైతన్యములో శోభించు జంతువుల కున్న చైతన్యము పక్షులందు లేకపోయినను,

బ్రహ్మమునకుఁ గల చైతన్యము వానియందు లేకపోలేదు. సదంశము వ్యక్తమయినట్లు చిదంశమును నానందాంశమును పాషాణాది ప్రతిమలందభివ్యక్తములు గాకపోయినను, నవిద్యమానములు కాఁజాలవు. అవిద్యమానములే యైనచోఁ జిదానందములపరిపూర్ణములు గావలసి వచ్చును; ఏలయన, నవి జంగమములందు మాత్రమే యుండుటచేతను స్థావరములందు లేకపోవుటచేతను బరిచ్ఛిన్నము లనవలసియుండును. ఏకదేశమునందు మాత్రమే వ్యాపించిన పదార్థములు పూర్ణత్వము గలవి కానేరవుగదా. కావునఁ బాషాణాదులఁ జిదంశమును సుఖాంశమును బ్రకాశించుటలేదని శ్రీ విద్యారణ్యులచేఁ బంచదశిలో నుడువఁబడిన మాట కిందువలన భంగము కలుగదు. అప్రకాశ మభావముకాదుగదా. మఱియుఁ, బ్రతిమకుఁ గల్పింపఁబడిన కరచరణాద్యవయవములుఁ జక్రాద్యాయుధములును జైతన్య సాహిత్యమును వెల్లడించుచున్నవి: అదియచేతనమైనచో హస్తాదులునిష్ప్రయోజనములగు. కాని, యవి ప్రయోజనము గలవి. కావునఁ బ్రతిమకుఁ జైతన్య మంగీకరిం

పఁ బడుచున్నది. అటులనే భోగసామర్థ్యంబు నూహ్యంబు. ఇట్లు, సచ్చిదానందము లీశ్వరునకును బ్రతిమకు నభావంబులు. మఱియు, నీశ్వర గుణములతోఁ గలిసియు గుణంబులు ప్రతిమయందుఁ బ్రత్యక్షసిద్ధములు—ఉదాహరణ మస్తిత్వము. ఏలయన, నీశ్వరున కునికిగలదు, ప్రతిమకును గలదు. కొన్ని లింగములవలన గ్రాహ్యములు. ఎట్లన, నాయుధములవలనదుష్టశిక్షణము తెలియఁబడుచున్నది. ఒక హస్తము వలన, నభయప్రదానము సూచింపఁబడుచున్నది. సాంద్రమేఘదర్శనమువలన సామాన్యముగా భావివర్షం బనుమానింపఁబడును. అటులనే గదాద్యాయుధదర్శన మీశ్వరుఁడు శిక్షింపఁగలవాఁడను జ్ఞానమునకు హేతువు కాఁగలదు. కొన్ని గుణంబు లాగమమువలన విగ్రహమునందారోపింపఁ బడుచున్నవి. ఎట్లన, సర్వగతత్వమీశ్వరునకుఁ గలదు; విగ్రహమునకుఁ గనఁబడుటలేదు; అయినను, నది సర్వగతమని మనము భావింపవలయును. అటులనే సర్వశక్తిమత్త్వము శాస్త్రము వలన లభించుచున్నది. ఇట్లు, ప్రత్యక్షానుమానాగమములవలన నీశ్వర గుణ

ములన్నియును విగ్రహములకు సిద్ధించుచున్నవి. కావున విగ్రహము లీశ్వరస్థానమున నుండఁదగదను మాట నమ్మవలదు.

## పదార్థస్వత్వము

కొందఱిట్లు వాదము సేయుచున్నారు-- ప్రతిపదార్థమును బరమేశ్వరునిచేతనే సృష్టింపఁబడినది. అది యాతనికిఁ జెందియున్నది. ఆతని వస్తువు నాతని కిచ్చుటకూడఁగు. అతనిది కాని దాతనికి సమర్పింపఁబడుఁగాక; కాని, యట్టిదెద్దియును లోకమున లేదు గావునఁ బత్రిపుష్పాదుల నాతనికి సమర్పణము సేయుటతప్పు. ఇప్పుడు వీరికిఁ బ్రత్యుత్తరము నిచ్చుచున్నాఁడను——

(1) అట్లైనచో, భగవంతుని కారాధనయే పోనగదు. మనము జిహ్వతో నెట్టి ప్రార్థనలను జేయఁగూడదు; తద్విషయమునై మనము చిత్తంబు తలంపవలదు; ఏలయన, జిహ్వాదులన్నియును నీశ్వరు నిర్మితములైనవే. ఒకని గుఱ్ఱము నాతని వశముచేయుట దానముఁ జేయుటయగునా? ఏ పదార్థమును మనదికానిచో, సర్వేశ్వరున కెట్టి సపర్యయుఁ బనికిరాదు. కాని, ఈదిన ఫలములు

వని ప్రతివారు లంగీకరించుచున్నారు. కావున, మన పదార్థములు కొన్ని గలవని యంగీకరింప వలయును. అట్టివి గలవు కాఁబట్టి వానిని సమర్థించుట తప్పుగాదు.

(౨) ఒకనియొద్ద మనము కొంత ద్రవ్యమును ఋణముగా గ్రహించి యుండినయెడల, నయ్యది మరల వానికిఁ జెందఁజేయఁ జనదు! ఆ ద్రవ్యము నపహరింప రాదందురేని, సర్వేశ్వరుని ద్రవ్యమును మాత్రమాతని కిచ్చుటయును చితమా? ఋణమిచ్చిన వానికా ద్రవ్యమును వడ్డితో నిచ్చునటుల, నీశ్వరునుండి మనము స్వీకరించిన పదార్థములను మరలవానికి వడ్డితోఁ, కృతజ్ఞతతో, సమర్పింపవలయుఁగదా.

(౩) కుమారుఁడు తండ్రికి సాయమొనరింప వలయునా? కూడదా? కూడునేని, మనమెవని యొద్దనుండి వస్తువును స్వీకరించితిమో వానికద్దాని నిచ్చుట మంచిదేయగును. పుత్త్రినకు దేహాదుల నొసఁగువాఁడు జనకుఁడు కాఁడా? జనకునిచే సంపాదింపఁ బడినదేహమైనను నొకఘనము గృహమునుండి గ్రహింపఁబడి తనయొద్ద కొమరునిచేఁ దండ్రిహస్తమున విడువఁబడినవస్తు

శాశ్వతవృద్ధికరమైన సంతోషంబు నొందుట లేదా? మఱియుఁ దండ్రి పుత్ర పౌత్రాదులు భవిష్యత్ సుఖంబును బొందరా?

(4) సంవత్సరమునకొకింత ధనమిచ్చు నటుల నేర్పాటుఁగావించి యొక భూస్వామి యొక కృషీవలునకుఁ దనభూమిని వశపఱచుచున్నాఁడు. అతఁడా భూస్వామికడ నేఁగునప్పుడొక ఫలంబును దీసికొనిపోయి యాతనికి సమర్పించును. అది తన భూమియందే పండినందున నాభూస్వామి ఫలంబునకుఁ గడునంత సంతోషించుట లేదా?

(5) దేవాదులకు మనము జలాదుల నర్పింపవలయునా? కూడదా? అర్పణమనుచితంబని ప్రతిపక్షులవలనసియుండు; ఏలయన, జలాదులు దేవాదులవల్లనే మనకుఁ బ్రాప్తించుచున్నవి. కాని, యర్పణ మనుచితమన్నట్టి యర్పణను విధించు గీతావాక్యమునకు విరుద్ధంబగు. ఇట్టివిరోధ మసమంజసంబు. కావున దేవాదులకు జలాదిదానము సమీచీనమై యగుచున్నది. ఇప్పుడా గీతావాక్యమ్ము నుదాహరించుచున్నాఁడను (3-12)

"ఇష్టాన్భోగాన్హి వోదేవాదాస్యంతే యజ్ఞభావితాః।
తైర్దత్తానప్రదాయైభ్యో యోభుంక్తే స్తేనఏవసః॥"

(యజ్ఞముచేత సత్కరింపఁబడినవారై దేవతలు మీకు నిష్టములయిన భోగముల నొసంగఁ గలరు. వారల చేత నీయఁబడిన వానిని వారలకుఁ గ్రిమ్మఱ సమర్పింపకయే యెవ్వఁడనుభవించునో వాఁడు నిశ్చయముగా దొంగయే యగును.)

(6) ఇచ్చుటయు స్వీకరించుటయు లోకవ్యవహారమునఁ జూపట్టుచున్నవి. మనకుస్వత్వమేలేదు గావున దానమే ఘటింపదని ప్రతిపక్షులుచేయు నాక్షేపంబునకు, స్వత్వములేదను హేతువు సిద్ధించుటలేదు కాఁబట్టి దానము సంభవింపఁగలదని సమాధానము. పత్రిపుష్పాదులు మనపదార్థములే యెట్లయినవనఁ, బురాకృత పుణ్యావశమున మనకవి లభించుచున్నవని యెఱుంగునది. అవి శ్రీహర్షుఁడు వచించిన రీతిగా "పూర్వపుణ్య విభవవ్యయ లబ్ధములు". మనము ధనము వ్యయముచేసి యొక ఫలమును గొనినట్లులఁ బుణ్యకర్మం బాచరించి భోగ్యవిషయంబులను సంపాదించుచున్నారము. అవి మనవి

కావున మనయిష్టమునుబట్టి దానిని కుసుమ
వినియోగింపవచ్చును. అయ్యది పరమేశ్వరునకు
సమర్పింపఁ బడునెడల దోషమేమి? నావస్తువు
లనే నాకు సమర్పించుట మంచిపని యగునా యని
భగవంతుఁ డాక్షేపింపఁ జాలఁడు; ఏలయన,
నయ్యవి పుణ్యమునకుఁ బ్రతిఫలముగా మనకు
సంక్రమించినవి; ఇఁక నాతనివిగావు. మఱియు,
నాతనివేయైనవని మనమంగీకరించినను, "మా
ది మాకిచ్చుట మదిమాన్యము లిచ్చుట" అను
న్యాయము చొప్పున దాని సొమ్మును మరల
వానికే సమర్పించుట గుణమేయగును గాని దో
షముగాదు. అదియునుంగాక, ఫలాదులను
'దుష్పూరోదర పూరణము' నకు వినియోగిం
చుట కంటెను, పుష్పాదులచే వారవనితాది
గాత్రముల నలంకరించుట కంటెను, పరమేశ్వ
ర స్థానీయమైన విగ్రహమున కట్టివస్తువులను
దానము చేయుట మేలు కాదా?

(7) సూర్యుఁడు వర్షోదకమును సము
ద్రమునకు నిచ్చుటగద్దా! ఏలయన, "సహస్ర
గుణముత్స్రష్టు మాదత్తే హిరసంరవిః" (వేయి
మడుంగులు జలంబులను వర్షించుటకేగదా

సూర్యుఁడు సరిత్సముద్రాదులనుండి వానిఁగ్రోలుచున్నవాఁడు) అను రఘువంశ (1-స.) వాక్యానుసారము ప్రతిసంవత్సరంబునను సంభవించుచున్న వర్షములు మన దేవానాంప్రియుల యాజ్ఞననుసరించి లోకమున నిఁక లోపింపవలసి వచ్చును.

(8) పదార్థములన్నియును బరమేశ్వరుని వైనవో, వానికిఁ దత్సమర్పణంబుచితమే యగును. అవి యాతనివి కాదందురేని, మనవే యగుటంజేసి మనము సమర్పించుట కర్హులమే కాఁగలము, ప్రతిగ్రహించుటకును నాతఁడర్హుండు.

(9) ఒకవస్తువు నిజముగా మనసొమ్మే కావచ్చును, అట్లుగాకపోవచ్చును. ఎట్లయినను, బరమేశ్వరున కద్దానిని సమర్పించుటకై మనము చేయునదియేమి? భోజనము చేయుటగాని [illegible] సమర్పణహేతువు. మనకుఁ బ్రసాదింపఁబడిన కరచరణాది కరణంబు లీశ్వరునకై సత్కర్మము చేసినే యెట్లు సార్థకములో, యావిధంబునఁ బత్రపుష్పాది సత్కారంబులును బరమేశ్వరునకు సమర్పితంబులగుచు సాఫల్యమును వడయఁగలవు.

## ఇంద్రియ సంతర్పణము.

నిరాకారోపాసనము—చిత్తము మిక్కిలి చంచలమైనది. వాయువేగముకంటెను మనోవేగ మధికతరమని లోకములోఁ బ్రసిద్ధి. ఇంద్రియ విషయములపై మనంబు పరువిడుచుండును. అతీంద్రియుండగు నీశ్వరునందు హృదయంబు లగ్నమగుట యెట్లు? కనులను మూసినమాత్రమున రూపముల ద్రష్ట చెడలేదు. కర్ణములఁ గప్పియుంచినమాత్రాన శబ్దముల శబ్దమంతరింపలేదు. "ఓ దేవుఁడా!" యనియఱచిన తోడనే దేవుండు దివమునుండి యూడిపడలేదు. ఇట్టి ప్రార్థనవలన నేలాభముండదు. విషయాస్వాదనలోలమగు డెందము నొక్కమాఱుగా నిగ్రహింపఁగ నీశ్వరునిఁ జేరుననుట వెఱ్ఱిమాట. కాన నిరాకారోపాసన మంత మంచి మార్గము కాదు.

భగవద్విషయాసక్తి—మఱి సరియగు మార్గ మెద్దియన, సాకారోపాసనము. దీనియందు నింద్రియములను మనస్సు నాకర్షించి క్రమక్రమముగా శబ్దాది వ్యతిరిక్తునందుఁ బ్రవేశపెట్టవచ్చును. "వ్యాఖ్య సుందరములగు

గానములు, రుచ్యములగు పదార్థములు మొదలగునవి కావలయును. అవాఙ్మానస గోచరుండగు భగవంతుఁడు మాకెందుకు?" అని మొరలిడుచుండు నింద్రియములు నిట్లు సమాధాన పఱుపవచ్చును: "ఓ యింద్రియములారా! భయపడకుఁడు. మీకుఁగావలసిన విషయములనిచ్చెదను. దేవాలయములోని యీ దివ్యమంగళ విగ్రహముఁ జూడుఁడు: శ్రావ్యములగు భగవన్నామ కీర్తనములఁ నాలింపుఁడు. రుచిగల యీ ప్రసాదమును స్వీకరింపుఁడు.

అప్పు డింద్రియములు సంతసించును. వెలయున విగ్రహములు, అలంకారములు, దీపములు మొదలగునవి నయనేంద్రియము నాకర్షించును. అగరు మొదలగు సుగంధద్రవ్యముల ధూపములును, దులసీదళాదులును, జాజాదిపుష్పములును ఘ్రాణేంద్రియమును సంతోషపెట్టును. పండ్లు మొదలగునవి నివేదనచేసి స్వీకరించుటచే రసనేంద్రియము సంతసించును. గీతములఁ బాడియు, స్తవములఁ బఠించియు శ్రవణేంద్రియమును దృప్తినొందింపవచ్చును. విగ్రహముయొక్క పాదములను స్పృశించుటయు

స్నానాద్యుపచారముల నిర్వర్తించుటయు స్వా ర్శనికసుఖ మొసంగును. మూర్తిని ధ్యానించు టచే మనంబున కానందము గల్గును. మధుర మైన యనుపానముతో మందును బాలుఁడు గ్రహించును. అటులనే బాహ్యములగు విషయ ములతో భగవంతుఁడు మనకు గ్రాహ్యుం డగును.

మారేడు, తులసి మొదలగునవి వా యువును బరిశుద్ధము చేయును. ధూపాఘ్రాణ ము, దీపసందర్శనము లోనగునవి మనస్సునకు వికాసముఁదెచ్చి దేహమున కారోగ్యము సమ కూర్చును.

విషయాంతరనివృత్తి--ఒకయాకారము నందే చిత్తమును నిల్పుటచే నేకాగ్రత యలవ డును. దృష్టిపథంబునఁ బడిన వస్తువులెల్లఁ జూ డనభిలషించిన నేత్రద్వంద్వ మిష్టదేవతయందు మాత్రమే లగ్నమగును. శ్రోత్రపుటములం దట్టిన శబ్దములెల్ల నాకర్ణింపఁ గాంక్షించిన కర్ణద్వ యంబు భగవన్నామము శ్రవణాసక్తమగు. సమీపించిన వస్తువులెల్ల స్పృశింప స్పృహఁగొ న్న స్పర్శనేంద్రియ చరణమాత్ర పరిచయంబగు

దృశ్యమగు పదార్థములెల్ల నాదరపూర్వకముగ గడవేయఁజూచిన జిహ్వ పరమేశ్వరునకు నివేదితమైనఁగాని యాస్వాదింప నభిలషింపదు. పరిమళములనెల్ల నాఘ్రాణింప నువుకట్టిన ముక్కు మొదట నీశ్వరునకు సమర్పింపఁగోరును. ప్రతి సంకల్పమును జేసిన చిత్తము భగవత్సంకల్పములను మాత్రమే చేయును. అనేక దుర్విషయముల నాలోచించు నలవాటుగలబుద్ధి యిష్టదేవతా రూపాదులనే స్మరించుచుండును. ఇట్లు క్రమక్రమముగాఁ జిత్తము బాహ్యప్రపంచమునందుఁ గొంతవఱకే వ్యాపించుచుండును. విషయవలయము సంకుచితమగుచుండును. చిత్తమంతర్ముఖమగుచుండును; అంతర్ముఖమైన చిత్తమాత్మయందుఁ బరమాత్మునవలోకింపఁగల్గును. కాఁబట్టియే. "జిహ్వేకీర్తయ కేశవం, మురరిపుం చేతో భజ, శ్రీధరం పాణిద్వంద్వ సమర్చయా, చ్యుతకథాం శ్రోత్రద్వయ త్వం శృణు! కృష్ణం లోకయ లోచనద్వయ, హరేర్గచ్ఛాంఘ్రియుగ్మాలయం, జిఘ్ర ఘ్రాణ ముకుంద పాదతులసీం, మూర్ధన్నమాధోక్షజం" (ఓ నాలుకా! కేశవుని కీర్తింపుము. చిత్తమా! మురారిని భ

జింపుము. హస్తద్వంద్వమా! శ్రీధరు నర్చింపుము. కర్ణద్వయమా! అచ్యుతకథను నీవాకర్ణింపుము. నేత్రద్వయమా! కృష్ణుని నవలోకింపుము. పాదద్వంద్వమా! హరియొక్క యాలయమున కేగుము. ఘ్రాణమా! ముకుందపాదతులసి నాఘ్రాణింపుము. శిరమా! అధోక్షజు నమస్కరింపుము) అని కులశేఖరుండను భక్తుఁడు స్వకీయ జిహ్వాదులను సంబోధించెను. ఇటులనే భాగవతమునఁ జెప్పఁబడియె—

సీ॥ చిత్తంబు మధురిపు • శ్రీపాదయుగలయంద
పలుకులు హరిగుణ • పఠనమంద
కరములు విష్ణుమం • దిరమార్జనములంద
శ్రోత్రములు హరికథా • శ్రవణమంద
చూపులు గోవింద • రూపవీక్షణమంద
శిరము గేశవనతిని • [illegible]
పదములీశ్వరగేహ • పరిసర్పణములంద
కామంబు చక్రికై • ంకర్యమంద

తే॥గీ॥ సంగమచ్యుత నిజగుణ • సంగమంద
ఘ్రాణమసురారి భక్తాంఘ్రి • కమలమంద
రసన తులసీదళంబులంద • రతులు భక్త
సంగతులయంద యారాజ • చంద్రమునకు.

పనిఁ గల్పించుట—మఱియు, జిహ్వాదులూరకయుండవు. అవి యేదో పని చేయుచుండవలెను. లౌకిక కార్యములందు వ్యాపృతము లగుటకంటెఁ బారమార్థిక కార్యములందు వ్యాపృతములగుట మేలు. లేనిచోఁ జిత్తము పాప చింతనము నైనఁ జేయుచుండును. "An idle brain is the workshop of mischief" (పని లేని బుద్ధి దుష్కర్మల కాగారము) నిరుపయోగాలోచనములైనఁ జేయుచుండును. జ్ఞానేంద్రియ కర్మేంద్రియముల చర్యయు నిట్టిదే. కాఁబట్టియే జపము చేయునపు డితుమాలికను ద్రిప్పుచున్నను ద్రిప్పకున్నను నిర్దిష్టమైన స్థానమునందే హస్తముండవలెను. అధ్యయనముఁ జేయునపుడు యజ్ఞోపవీతమును హస్తములో నుంచు నాచారమును జూచుచునే యున్నారము. "Habit is second nature" (అలవాటు రెండవ స్వభావము) పై రీతిని మనోవాక్కాయము లాచరించుచు వచ్చినయెడల భగవద్భావము ప్రవృత్తియు, విషయాంతర నివృత్తియు స్వాభావికములై యయత్నసిద్ధములగును.

## ఏకాగ్రత.

విగ్రహారాధనము చిత్తైకాగ్ర్యము కొఱకు నిర్ణయింపఁ బడినదనియుఁ, జిత్తమునకేకాగ్రతయలవడినవారు విగ్రహారాధనము విసర్జింప వలయుననియుఁ గొందఱు చెప్పుచున్నారు. వీరి పలుకులు భక్తులెవ్వరును నమ్మఁజాలరు. ఏలయన—

(1) భక్తి యేకాగ్రత కంగముగాదు. ఏకాగ్రతయే భక్తి కంగముగా బోధింపఁబడు చున్నది. అట్టి భక్తియందుఁ బ్రతిమార్చనంబు గర్భితమగుచున్నది. కావునఁ బ్రతిమార్చనంబు వలన మనంబు నైక్యమున నిశ్చలముగా నిల్చుట సంభవించినను, అయ్యది యానుషంగిక ఫలంబగును గాని ప్రధానఫలంబు కానేరదు. ఒక చూతవృక్షము భూమిపై నాటఁబడుచున్నది. అది పండ్లకొఱకే యుద్దేశింపఁబడినది; దానివలన నీడకూడఁ గల్గును. అయినను నీడ ముఖ్యఫలంబుగాదు. అటులనే విగ్రహారాధన వలనఁ జిత్తచాంచల్యముడుగవచ్చును; అంతమాత్రమునచే చాంచల్యాభావమే ప్రతిమార్చనయొక్క

తరము నుద్దేశించియున్నది. అది పాన మనుభవా ర్థముకాదు, ఔషధము కొఱకు. అటులనే యేకాగ్రత భక్తి నిమిత్త మేర్పడినది. భక్తుఁడు పరమేశ్వరు నెల్లప్పుడును స్మరించి యారాధింపఁ గోరును. ఒక్క నిముసమైనను భగవదను సంధానము లేనిచో దుర్భరంబగు. ఎల్లప్పుడు సర్వేశ్వరుని స్మరించి యారాధించుట, చిత్త మొకని పై నిలువనియెడల సంభవింపదు. కావున, భక్తి స్మరణ నపేక్షించుచున్నది; స్మరణ యేకాగ్రత నపేక్షించును.

(౪) విగ్రహారాధన లక్ష్యసిద్ధికి నియమింపఁబడినదికాదు. అభ్యాసార్థమయిన లక్ష్యము కొమ్మగముగాఁగాని, పక్షిగాఁగాని యెన్నటికిని మాఱునదికాదు. లక్ష్యవేధ నాభ్యాసము (target practice) వలన నొక బిందువును (లేక, వస్తువును) గొట్టుట మాత్రమే యలవడును. అట్టిబిందువుగాని, వస్తువుగాని, యభ్యాసదశయందు నిర్మింపఁబడిన బిందువునకుఁగాని వస్తువునకుఁగాని బాహ్యముగా నుండును; ఏలయన, నిజమైనది శత్రువుయొక్క శిరముగాని, మృగముయొక్క హృదయముగాని, యైయుండ

వచ్చును. విగ్రహమట్టిదికాదు. అది యొకటి నభ్యాసకుని లక్ష్యమువలె బధిరమై మూకత్వము గల్గి, చైతన్యశూన్యమై యుంచఁబడినను, భక్తి యతిశయించిన కొలఁది వినుటయు, మాట్లాడుటకును, నడుచుటకును సమర్థమై భక్తుల ననుగ్రహింప వచ్చును. సామాన్యమైన లక్ష్యమైనచో, నట్టి యద్భుతకార్యములఁ జేయఁగలదా? కావున విగ్రహారాధనము గుఱిఁ జూచుటవంటిది కాదు. 'నేనింతకాలము గుఱికై విగ్రహము నారాధించి చిత్తమొక్క గుఱి యందు మాత్రమే నైశ్చల్యముతో నుండుటను సంపాదించినాను. నాకు నిప్పుడు గుఱి కుదిరినది. కావున విగ్రహము నీక నదాగ్రమునఁ బడవైచి యాత్మాన్వేషణమునకై హిమవత్పర్వతమున కేగి యచ్చట జ్ఞాననిష్ఠచేఁ గృతార్థుఁడ నయ్యెదను' అని చెప్పు మహానుభావులు విగ్రహారాధకులు గారు.

(౫) ధ్యాన మనేకాంశములు గలది. మనము విగ్రహమును నిరంతరము ధ్యానింప వలయును. విగ్రహము విగ్రహమని ధ్యానింపఁ గూడదు. విగ్రహమే పరమేశ్వరుఁడని ధ్యానింప

వలెను. ఇతరవిషయ చింతనముమాని విగ్రహ
మును మాత్రమే స్మరించుట చిత్తైకాగ్ర్యమన
దగు; అది యొక బోయవాఁడు తనమనంబు
నొక పవాగంబునం దుంచినట్లుండును. విగ్రహ
మే యీశ్వరుఁడని భావించుట ధ్యానముగును.
ఈ విగ్రహము మన్నుతోఁ జేయఁబడినది. దీని
పొడవు మూఁడంగుళములు, వెడల్పు రెండంగు
ళములు, రంగు నల్లగానున్నది. ఆకృతి మాన
వుని యాకృతినిఁ బోలును; ఇది మాటాడ లేదు,
విన లేదు. ఇంకను విశేషములు గలవు' అని
తలంచుటతో విగ్రహారాధకుఁ డున్నఁడైనను
దృష్టినందఁగలఁడా? విగ్రహముయొక్క ప్రత్య
క్ష సిద్ధములయిన రూపాదులు పేక్షణీయములని
మొదట నుపదేశింపఁబడ లేదు; కావున నట్టి
రూపాదులను మనము స్మరించుచునే యుండ వ
చ్చును. కాని, వానితో భగవద్గుణ గణంబును
గలుపవలెనని బోధింపఁబడుచున్నది. ప్రత్యక్ష
గోచరములయిన జాడ్యాదిగుణంబులు శాస్త్ర
ప్రోక్తములయిన సర్వజ్ఞత్వాది గుణంబులను
దిరస్కరింపకుండునట్లు విగ్రహారాధకుఁడు జాగ
రూకుఁడై యుండవలెను. ఇప్పుడు భక్తికివచ్చు

చున్నారము; ఇదియే విగ్రహారాధనకుఁ బ్రధాన
మైన యంశము. అనఁగా, మన మొక పదార్థ
ము మఱియొక పదార్థమని తలంచుటతోఁ దని
విడవక, యట్టిభావము హృదయారూఢమగున
ట్లు చేసికొనవలయును. ఇట్లు నిర్దిష్టమయిన విగ్ర
హము సత్యావిష్టమయిన భగవత్పదార్థమని వి
శ్వసించి గాఢానురాగంబుతో సేవించుట భక్తి
యనఁబడుచున్నది. కావున, విగ్రహమును స్మ
రింపుము కాని, యట్టి స్మరణంబు చాలదు,
విగ్రహమే పరమేశ్వరుఁడని చిరకాలమవిచ్ఛిన్న
ముగా ధ్యానింపుము. అట్టి ధ్యానమయినను
చాలునది కాదు, ఏలయన, నయ్యది మానసక్రి
య మాత్రమే యగును, కావున హృదయపూ
ర్వకముగా విగ్రహమే భగవంతుఁడని సమ్య
గారాధింపుము; ఇట్టి భక్తియే మనుజుని రక్షిం
చునది, పూర్వలిఖితములగు యంశము లిందు
లకై వచింపఁబడినవి. విగ్రహమందు విగ్రహ
దర్శనము మొదటి యంశము. విగ్రహమునం
దీశ్వరబుద్ధి రెండవది. విగ్రహమందీశ్వరభక్తి
మూఁడవది. అట్లు గావునఁ జిత్తమే కాగ్రమగు
టకు విగ్రహము కల్పింపఁబడినదనుట కల్ల.

## —పరిశీలన విన్నపము—

విగ్రహము పరాత్పరుని వ్యాపకస్థానమని యు, విగ్రహమే పరాత్పరుం డనుటకు వీలులేద నియు, వాదించు వారికి క్రింది యుత్తరము నిచ్చుచున్నాఁడను—

(1) ఈశ్వరునకు వ్యాపకస్థానము కూడఁ గలదా? సర్వవ్యాపకుఁడయిన విష్ణువొక దేశ మున నుండువాఁడును దేశాంతరమున లేనివాఁ డును నగునా? శ్రీ శంకరాచార్యులాత్మబోధ యను గ్రంథమున "వ్యాప్యవ్యాపకతామిథ్యా సర్వమాత్మేతిశాసనాత్" (జగత్తు సర్వంబును ఆత్మయని వేదమానతిచ్చియుండుటం జేసి, దే శాదికము వ్యాపింపఁబడునదిగాను, ఆత్మ వ్యా పించునదియుఁ గానేరదు.) అని తెల్పియున్నాఁ డు. ఒక గోవొక గృహమును బ్రవేశింపఁగల దు, ఏలయన, గోవును గృహంబును భిన్న పదార్థములు. గోవు గోవునుగాని గృహము గృ హంబునుగాని ప్రవేశింపఁగలదా? అటులనే స ర్వంబును ఆత్మయైనప్పుడది వ్యాపించునది వ్యాపింపఁబడునది యెట్లు? కానే [illegible]

శించుట సంభవింపదుగదా.

(౨) వ్యాప్తి సిద్ధాంత మబద్ధమని యంగీకరించువారు విగ్రహమే యాశ్వరుఁడగునా యని యచ్చెరువొందుట యేలనో! మాయభేద సిద్ధాంతమును మీ వ్యాప్తి సిద్ధాంత మెట్లు మింగివేయఁ గలదు? మేము చెప్పినదియే సత్యమున కెక్కువగా సమీపమునన్నది, ఏలయన, బ్రహ్మంబును విగ్రహంబును భిన్న వస్తువులు కావు.

(౩) ఉపనిషత్తులందుఁ బ్రతీకోపాసన మనఁబడునది రెంటికి నభేదమునే యపేక్షించుచున్నది. బ్రహ్మంబు ప్రతీకమందు, సింగంబు గుహయందుఁ గూర్చుండునటుల, దాగియుండునని ధ్యానింపఁబడుట లేదు. ఈశ్వర చిహ్నమయిన ప్రతీకమే యీశ్వరుఁడని భ్రమపడవలదనియుఁ, బ్రతీకాంతర్గతుఁడయిన వానిని మాత్రమే యీశ్వరుఁడని ధ్యానింపవలయుననియు, మన ప్రతిపక్షులు హెచ్చరించుచున్నారు. ఇది సరిగాదు, ఏలయనఁ, బ్రతీకమే బ్రహ్మమని భావింపఁ దగినదని శాస్త్రము, ప్రతీకమందు నిండియున్న వస్తువు మాత్రమే బ్రహ్మమని కాదు. ప్రతీకమే

బ్రహ్మమని తలంచుటా, లేక, బ్రహ్మమే ప్రతీకమని తలంచుటా, యని మీమాంస; ప్రతీకాంతర్గతమయినది బ్రహ్మమా, బ్రహ్మాంతర్గత మయినది ప్రతీకమా, యనికాదు; ప్రతీకమే బ్రహ్మమా, లేక, తన్నిష్ఠము బ్రహ్మమా యనియును గాదు. కాఁబట్టియే శ్రీశంకరాచార్యులు బ్రహ్మసూత్ర భాష్యమున, నాల్గవ యధ్యాయము యొక్క ప్రథమ పాదమందలి యైదవ సూత్రము క్రింద, నిటుల నిష్కర్షగా నుడివియున్నారు—

"ఆదిత్యాదీన్ బ్రహ్మఇతిప్రతీయాత్"

(సూర్యుఁడు, మనస్సు, వాక్కు మున్నగు ప్రతీకములనే బ్రహ్మమని భావింపవలెను.)

(4) ప్రతిమార్చన మతిప్రాచీనము, సర్వజనీనము, నసందిగ్ధమునై విలసిల్లుచుండుటం జేసియే శ్రీ శంకరాచార్యు లుపనిషదుక్త ప్రతీకోపాసనమును బ్రతిమార్చనముచేఁ బ్రకాశింపఁ జేసిరి—

"ఈదృశంచాత్ర బ్రహ్మణః ఉపాస్యత్వం, యత్ప్రతీకేషు తద్దృష్ట్యధ్యారోపణం, ప్రతిమాదిష్వివవిష్ణ్వాదీనాం"-

(ఇచ్చట, బ్రహ్మముపాసింపఁదగియుండుటయన,

నిట్టిదే. ఎట్టిదనఁ, బ్రతిమలందు విష్ణ్వాదుల భావమువలెఁ బ్రతీకములందును బ్రహ్మదృష్టి నారోపించుట.)

ముఖము చంద్రుని వంటిది. ఇవ్విధం బునఁ బ్రతీకోపాసనము ప్రతిమార్చనమును బోలియున్నది. సుప్రసిద్ధమయిన వస్తువు నిదర్శనముగాఁ బ్రదర్శింపఁబడును. కావున విగ్రహారాధకుఁడు విగ్రహమును బరమేశ్వరుఁగా భావించునటులఁ బ్రతీకోపాసకుఁడును బ్రతీకంబును బ్రహ్మంబుగా భావింపవలయునని వచించిన శ్రీ శంకరులకు విగ్రహమును భగవంతునిఁగా ధ్యానించుట సుప్రసిద్ధమగుటంజేసి సమ్మతమగుచున్నదని స్పష్టమైనదిగదా.

(5) 'మనోబ్రహ్మ' (చిత్తమే బ్రహ్మము) అను శ్రుతివాక్యమునందు మనస్సునకును బ్రహ్మంబునకును సామానాధికరణ్యము వలన నభేదము తెలియఁబడుచున్నది. కాని, యీ రెండును భిన్నవస్తువులు, వానికి సామానాధికరణ్యమెట్లనఁ 'ఘటము పటము' అను వాక్యమునందలి ఘటపటములు రెండును నభిన్నములు కాఁగలవాని 'ఆవు గుఱ్ఱమగుచున్నది' అను

నప్పుడావు నిజముగా గుఱ్ఱము కాఁగలదా? కావున మనంబను శబ్దము మొదట వచ్చునది కాన దానికిముఖ్యార్థమును గ్రహింపవలెను, బ్రహ్మమను శబ్దము మొదటిదానితో నేకీభవించుటకై దానికి లాక్షణికార్థమును స్వీకరింపవలయును. ఇట్లు మనస్సుబ్రహ్మమని ధ్యానింపనగు.

(6) మఱియు, 'మనోబ్రహ్మ ఇతి ఉపాసీత' అను వాక్యములో 'మనః' అను పదమునకు 'ఇతి' అనునది లేదు. 'బ్రహ్మ'. అను దానికది కలదు. 'ఇతి' అను శబ్దమునకు 'అని' అని యర్థము. 'బ్రహ్మఇతి' అనుదానికి 'బ్రహ్మమని' అర్థము. ఏది బ్రహ్మమని? మనస్సు బ్రహ్మమని. మనస్సు బ్రహ్మమని యేమిచేయవలెను? ధ్యానింపవలెను. కావున బ్రహ్మపదము 'ఇతి' అనుదానినంతమునఁ గల్గియుండుటచే మనంబున బ్రహ్మప్రతీతి విధింపఁబడుచున్నదని చెల్పుటకు శ్రీశంకరులు శుక్తికారజతప్రతీతిని దృష్టాంతముగాఁ బ్రదర్శించి యున్నారు—

"తతశ్చశుక్తికాం రజతమితి ప్రత్యేతీత్యత్ర, శుక్తివచన ఏవశుక్తికాశబ్దః, రజతశబ్దస్తు రజతప్రతీతిలక్షణార్థః. ప్రత్యేత్యేవహి కేవలం రజతమితి,నతుతత్రరజతమస్తి."

(అందువలన, 'శు క్తి కను వెండియని తలంచు చున్నాఁడు' అను వాక్యమునందలి శు క్తి శాపద ము శుక్తిని మాత్రమే పలుకుచున్నది. రజతప దమన్ననో, రజత జ్ఞానమను లాక్షణికార్థముఁ గల్గినది. ఏలయన, వెండియనితలంచుచున్నాఁ డేగాని యచ్చట నిజముగా వెండిలేదు.)

ఆక్షేపము—ప్రతీకమందు బ్రహ్మదృ ష్టికి శు క్తియందు రజతదృష్టి దృష్టాంత మగు నెడలఁ, బ్రతీకమును బ్రహ్మమని భావించుట భ్రమయగును గాన గ్రాహ్యంబు కానేరదు.

సమాధానము—శుక్తి రజతబుద్ధి విధిం పఁబడుటలేదు; భ్రమవలన నొకనికది పుట్టుచు న్నది; దానివలన లాభమును గలుగదు. కాని, ప్రతీకమును బ్రహ్మమని తలంచుట విధింపఁబడు చున్నది; అది శాస్త్రమువలన లభించునది; దానివలన ఫలంబును జేకూరుచున్నది. కావు న నీరెండు వాక్యములును నెల్ల యంశములం దును సమానములు గావు. ఒక వస్తువును మఱి యొక వస్తువుగాఁ దలంచుటయందుసామ్యము. తలంచుటా, తలంపకుండుటా, యను విషయ మి చ్చట వివక్షితముగాదు. ఇత్యంతముకాని ప్రథ

మ పదమునకు ముఖ్యార్థమనియు, నిత్యాంతమయి
న రెండవపదమునకు లాక్షణికార్థమనియుఁ, బ్ర
థమపదార్థమును ద్వితీయపదార్థముఁగా భావిం
చుట ప్రతీకోపాసనమందు విధింపఁబడుచున్న
దనియు నెఱుఁగునది.

(7) ఉపాసింపఁదగినది ప్రతీకమేయని
వాక్యశేషము నందలి ద్వితీయావిభక్తివలనఁ
గూడఁ దెలియుచున్నది. ఎట్లన, 'వాచం బ్ర
హ్మేత్యుపాస్తే' అను దానియందు 'వాచం'
(వాక్కును) అను పదము ద్వితీయాంతమగుటం
జేసి వాక్కనునది యుపాసించుటయను క్రియ
కుఁ గర్మయగుచున్నది: దేని నుపాసించుట?
వాక్కును. ఏమని? బ్రహ్మమని.

ఇట్లు వాక్కు, మనస్సు, మొదలయిన
ప్రతీకములనే బ్రహ్మమని తలంచుట విధింపఁ
బడుచున్నది కాఁబట్టి పాషాణాది ప్రతిమలనే
బ్రహ్మమని భావించుట వలన దోషమేమి?
ప్రతిమల లోపలనున్న వస్తువుమాత్రమే బ్ర
హ్మమననేల? ప్రతీకములలోఁ దాగియున్న వస్తు
వుమాత్రమే బ్రహ్మమని తెల్పఁబడినదా? కావు
నఁ బ్రతీకమే బ్రహ్మము, ప్రతిమయే బ్రహ్మము.

## విగ్రహ విభజనము

విగ్రహమును మనమారాధింప వలెను. కాని, యేకకాలమున విగ్రహమును సర్వంబును గ్రహించుట కష్టము. విగ్రహముయొక్క భాగములెల్ల నొక్కసారి స్మరించుట దుర్బలమయిన బుద్ధికి సాధ్యమగునదికాదు. బాహ్యపూజయందయినను ప్రతిమయొక్క శిరంబునఁ బుష్పములను వైచినచో, భుజములందవి పడకపోవచ్చును, ప్రతిమను సర్వంబు నొక్క సమయంబునఁ గుసుమంబులతోఁ గప్పుట సుకరము కాదుగదా. మఱియు, విగ్రహమంతయు నేక కాలమున నర్చించుట సాధ్యమయినను, గొండొక కాలమునకు విసుగుకలుగును.

కావున నొక్కొక్క భాగము చొప్పున నారాధన కర్తవ్యము. మొదట పాదములను బుష్పాదులచేఁ బూజించి, పాదసౌందర్యమును జింతనముచేసి, శాస్త్రముచే నారోపింపఁబడిన గుణవిశేషంబుల నాలోచించి, కొంతకాలము చనినపిదప పాదములను విడిచి సమీపమున నున్న మఱియొక యవయవమును స్వీకరింపవలెను. ఇట్లు వరుసగాఁ బ్రతిభాగమును నారాధిం

చుచు వెళ్ళి తుదకు శిరంబు నర్చింపవలయును. ఇది యాశోపావ్రక్రియ. శ్రీశంకరాచార్యులచే రచియింపఁబడిన శివపాదాది కేశాంతవర్ణనము ను విష్ణుపాదాది కేశాంతవర్ణనమును దీని నవ లంబించి యున్నవి. భగవంతుని ధ్యానించునప్పు డిదియే తఱచుగా నాదరింపఁబడుచున్నది. కాఁబ ట్టియే శ్రీమద్భాగవతమున—

"సంచింతయే ద్భగవతశ్చరణారవిందం"

(భగవంతుని పాదపద్మములను ధ్యానింప వల యును.)

అని చెప్పఁబడినది. అటులనే జగన్నాధ పండిత రాజు తన భామినీ విలాసముయొక్క కడపటి భాగమందు భగవన్మూర్త్యుపాసన యొక్క క్రి మము నిటుల సూచించియున్నవాఁడు (శ్లో 16)-

"ప్రథమంచుంబితచరణాజంఘాజానూరునాభిచక్రాణి।
ఆలింగ్య భావనా మే ఖేలతు విష్ణోర్ముఖాబ్జశోభాయాం"

(నాచిత్తవృత్తి మొదట విష్ణునియొక్క ముద్దు పెట్టఁబడిన పాదములుగలిగి తరువాత వరుసగా జంఘములను, జానువులను, నాభిమండలమును కౌఁగిలించికొని యటుపిమ్మట ముఖపద్మముయొ క్క సౌందర్యమందుఁ గ్రీడించుఁగాక.)

ఒకానొక నాయిక ప్రేమంబున వినయముతో నొక్క నాయకుని పాదములపైఁబడి యాతని యనుగ్రహమును సంపాదించి, పిమ్మటఁ బరిరంభాదులను యథేచ్ఛముగా ననుభవించి, కడపట ముఖవిలాసవిలోకనమందు విశ్రాంతి నొందుభంగి, భక్తుని భావనయు నొనరించునని కవి యాశయము. మఱియు, శిరమునుండి క్రిందికి దిగుచుఁ, గంఠము, వక్షఃస్థలము మున్నగువాని వర్ణించుచు, మరలఁ బాదములకు వచ్చుట యవరోహపద్ధతి. శ్రీ శంకర విరచితమైన శివకేశాది పాదాంత వర్ణనమిట్టిదియ. కావున సౌకర్యార్థము విగ్రహమును విభాగించి తత్తద్భాగములను వేఱువేఱ సేవింపనగు.

రెండవ పవ్రియోజన మేమన, వినుగునందఱి యారాధనమునందు దీర్ఘకాలము మనము మగ్నులము కాఁగలము. ఒక భాగమయిన తరువాత మఱియొకభాగము, దాని యనంతరమింక నొకటి-ఇవ్విధంబున శ్రమంబు నందకుండ నర్చనము సాగింపనొప్పు ను.

మూఁడవ లాభమారాధనము నెచ్చటఁ బ్రారంభింపవలయునో యేక్రమంబున నిర్వర్తిం

పవలెనో యది మందమతికిఁగూడఁ దెల్లముగుట. అయోమార్గమున శకటము త్వరితముగాఁ బరుగిడునుగదా. పట్టలు లేనిచోఁ జక్రములు భూమిని దిగఁబడుటగాని, ప్రక్కలకుఁ బోవుచుండుట గాని, కలుగును; సారధియు దారి తెలియనివాఁడై కష్టపడును. కావున విగ్రహమునవాద్దులకు నుపయోగమున్నది.

నాల్గవఫల మెట్టిదన, విగ్రహా విభజనమువలన విశేషానుభవము కలుగును. శరీరజ్ఞానము నపేక్షించిన బాలురు కొందఱు పాఠశాలయందు మొదట నొక్క యవయవంబును మాత్రమే ఖండించి బాగుగాఁ బరీక్షించి యందలి నరములు మున్నగు వాని తత్త్వము నెఱింగినవారయి పిమ్మట మఱియొక యవయవమును బరీక్షించి దానివిషయమై కూడ జ్ఞానము సంపాదించినవారై తరువాత నింక నొక యంగమును గ్రహించినవారయి, యిట్లు మొత్తమున దేహంబు సర్వంబును నెఱింగినవా రయ్యెదరు గదా. పృథక్కరణము(specialisation) వలన లాభము లేదా?

ఇఁక నైదవ యుపయోగ మెద్దియన,

సౌందర్య వైచిత్ర్యము వలన సంతోషబాహుళ్యము. నేత్రముల కొక విధమైన యందము న్నది, హస్తములకు మఱియొకటి, పాదముల కింకనొకటి, ఇట్లు, విగ్రహావయవంబులెల్ల రమణీయంబులు గాన భక్తుని చిత్తంబున నానందంబు సంకురింపఁ జేయుచుండును. ఇట్టి లాభంబు లాలోచించియే మన పెద్దలు "ఉదరం పూజయామి" (ఉదరమును బూజించుచున్నాఁడను) "కంఠం పూజయామి" (కంఠమును బూజించుచున్నాఁడను) అని పూజావిధానమున నుడివియున్నారు.

## విశ్వరూపము

శ్రీరామానుజాచార్యుల మతమున భగవంతుఁ డుభయాంశములతో నొప్పుచున్నాఁడు-లోకములోని ప్రాణుల జీవాత్మ లన్నియును జిద్భాగము, జీవములేని పదార్థములన్నియును జడభాగము. ఈ రెండును గలసి పరమేశ్వరునకు శరీర మగుచున్నవి. మానవ దేహమున జీవాత్మ నిండియుండిన చందమున, నీశ్వర దేహమందును నీశ్వరుఁడాత్మయై భాసించుచున్నాఁడు.

ఆతఁడు చిదచిద్విశిష్టుఁడు, చరాచరవస్తుజాల మాతనికంటె వ్యతిరిక్తంబుకాదు, కావున శ్రీరామానుజులమతము విశిష్టాద్వైతమనఁ బడుచున్నది. గీతాభాష్యమున (అ. 11- శ్లో 40) శ్రీ రామానుజు లిటుల వక్కాణించిరి—

"తతః సర్వోఽసి-యతస్త్వం సర్వం చిదచిద్వస్తుజాతమాత్మతయా సమాప్నోషి, అతస్సర్వస్య చిదచిద్వస్తుజాతస్యత్వచ్ఛరీరతయాత్వత్ప్రకారత్వాత్ సర్వప్రకారస్త్వమేవసర్వశబ్దవాచ్యోఽసీత్యర్థః"

(అందువలన నీవు సర్వము నయి యున్నావు: చిదచిద్వస్తు సముదాయమయిన సర్వంబును నాత్మగా వ్యాపించియున్న హేతువుచేతఁ జిదచిద్వస్తు జాతమంతయును నీ శరీరమే గావున సర్వాకారుఁడవగు నీవే సర్వశబ్దవాచ్యుఁడ వగుచున్నావని యర్థము)

శ్రీ శంకరులు గీతాభాష్యమున నీ రీతిగా వాకుృచ్చియున్నారు (అ. 11- శ్లో. 40)-

"త్వయావినాభూతం నకించిదస్తీత్యభిప్రాయః"

(నీవుగాని దెద్దియును లేదని భావము)

అట్లగుటంజేసి, యొక ప్రతిమ పరమేశ్వరునికి భాగమగుచున్నది. అన్యపదార్థ మెద్ది

యు నర్పింపఁబడుటలేదు. పరమేశ్వరాభిన్నమ
యిన విగ్రహమును సేవించుటవలన నాక్షేప
మేమి?

ఆతని దేహముపాసనకు యోగ్యమైనది
కాదా? ఆతని యాత్మమాత్రమే యుపాసింపఁ
దగినదా? కాని, యాతని దేహమునకును నాత్మ
కును సంబంధము నిత్యమని యంగీకరింపఁ బడు
చున్నది గాన రెంటిని వేఱుజేయుటయెట్లు?
దేహమును విసర్జించి యాత్మనుమాత్రమే గ్ర
హించుట మీకు సాధ్యమగునా?

మఱియు, నాతని శరీరమును బరిత్యజిం
పవలసినంత యవసరమేమికలిగినది? అదిచేసిన
పాపమేమి? మన నేత్రాదులకు గోచరించునది
యది, మన కామితముల నొసంగునదియు నది
యకానొప్పు. కరతలగతమయిన పాయసమును
బాఱవైచి చేతిని నాకుట యేల? తనకు
నందిన పరమేశ్వరుని దేహమును దృణీకరించి
వాగాదుల కతీతమయిన యాత్మనుబట్టుకొనుట
కు యత్నించు పామరుఁ డున్నతపురుష లభ్య
మయిన ఫలమునందలి యాశవలన నుద్బాహుఁ
డయిన వామనునిరీతి ("ప్రాంశులభ్యే ఫలేలోభాదు

ద్భావారివవామనః'') నవ్వఁదగినవాఁడగుచున్నాఁడు. నైశ్చల్యాదులు గల యాత్మయనుగ్రహాదులను నిర్వర్తించుననుటకంటెఁ జలనాదులు గల శరీరమే యట్లు చేయునని తలంచుట కూడనిదా?

శంకరులు లోక పదార్థమును బరీక్షించి దానికి నామరూపములను నిషేధించి బ్రహ్మత్వమును జెప్పుచున్నారు. రామానుజులా పదార్థమునకే పారమార్థికత్వమును గ్రహించి భగవదంశత్వమును బల్కుచున్నారు. ఉభయ పక్షములందును బ్రపంచము బ్రహ్మముయొక్క విలాసమే యగును గాన నుపాస్యమగుచున్నది. "గరిమఁ స్వర్ణమనేక,..." అను భారత పద్యమున బంగార మనేక భూషణములై కనిపట్టు చందంబునఁ బరమాత్ముండఖిల ప్రపంచము యుఁడై భాసించు హేతువుచేత సురసిద్ధాదులకాశ్రితము సంభావింపఁ దగియున్నారని తెల్పఁబడినదికదా?

మఱియు, 'శ్రీకృష్ణుఁడర్జునునకు విశ్వరూపంబును బ్రదర్శించెను. లోకమునందలి వస్తువులన్నియు నందుఁ జూడఁబడియె. అక్కడ ను

న్నవే లోకమున నున్నవి, అచ్చట లేనివి యొచ్చటను గానరావు. కావున, నీ విశ్వమే యారూపము

మానవుని బుద్ధి తఱచుగా నేకత్వమును గాని, బహుత్వమునుగాని, చూడఁగలదు. ఏకమందు బహుత్వముఁగాని, బహుపదార్థములందేకత్వముఁగాని, గ్రహింపఁజాలదు. మొదటిది యెట్లనః సంగీత శాస్త్ర పరిచయము లేనివారు రాగ, తాళాది భేదములను గుర్తింపనేరరు; వారికి రాగములన్నియు నేకవిధములయి తోఁచును, తాళములెల్ల నొక్కరూపమున నుండును. శాస్త్రజ్ఞుఁ డట్టిభేదముల నెఱుంగును; అనఁగా నాతఁడభేదమందు భేదము నవలోకించును. అటులనే రసాయన శాస్త్రజ్ఞానము లేనివారు పదార్థములన్నియు సజాతీయంబులని భావించెదరు, జ్ఞానముగలవారు వాని వైజాత్యమును దిలకింపఁగలరు. వైద్యమునఁ బ్రవేశము లేనివా రెల్లరోగములు నేకరోగమేయని తలంచి యన్నిటికినిఁ గరక్కాయ పోడుమునే ప్రయోగించెదరు! ఇవి యభిన్నములందు భిన్నత్వదర్శనమునకు నుదాహరణములు. ఇఁక, భేదమం

దభేదమును గ్రహించుట మెట్టిదనఁ: వ్యాకరణానభిజ్ఞుఁడనేక ప్రయోగములకుఁ దగిన సూత్రమునుగనుఁగొనలేఁడు, తదభిజ్ఞుఁడుకనుఁగొనును. ఒకఁడు వజ్రము వేఱనియు, బొగ్గు వేఱనియు, నమ్మును. ఉభయము నెఱింగినవాఁడు వస్తుభేదము లేదనితలంచును. ఇప్పుడు, విశ్వరూపమున నర్జునుఁ డీ రెండు భావములను గలిగి యుండెను. ఏలయన, నతఁడు వివిధ వస్తువులను జూచుటయేగాక సర్వంబునేకమనిగ్రహించెను.

ఉపనిషత్తు "సర్వం ఖల్విదం బ్రహ్మ" (ఈ సకల ప్రపంచమును బ్రహ్మమేగదా) అని యుద్ఘోషించుచున్నది. శ్రీకృష్ణుఁడును నర్జునునకు దీనినే బోధించెను. కాని, భిన్నలక్షణములు గల బ్రహ్మప్రపంచములు రెండును నభిన్నములనుట సందేహమును గలిగించెను. అప్పుడు విశ్వరూపము ప్రదర్శింపఁబడెను. దానిఁ జూచిన పిమ్మట నర్జునుఁ డీ సిద్ధాంతమును నమ్మవాఁడాయెను. ఒకవస్తువు ప్రత్యక్షముగాఁ బ్రదర్శింపఁబడినప్పుడు దృఢజ్ఞాన ముదయించునుగదా. ఇది వస్తుప్రదర్శన పూర్వకముగా బోధించు పద్ధతి (Object lesson).

ఆక్షేపము—విశ్వరూపమంతయు నుపాసింపఁబడుఁగాక. కాని, తద్భాగములయిన పాషాణములు ప్రత్యేకముగా నుపాసనకు యోగ్యములు కానేరవు. కావునఁ బ్రతిమార్చనము తప్పు.

సమాధానము—భక్షింపవలెనన్న, భక్ష్యంబు సర్వంబును భక్షింపఁ బడవలయును గాని తద్భాగ మొక్కటియ భక్షింపఁ దగినది కాదు! కంఠావరోధము కలిగి ప్రాణాపాయము సంభవించినను మంచిదియ! శక్తిగలవారు సకలంబును గబళింపవచ్చును. కాని, లోకములో నధిక సంఖ్యాకులు శక్తివిహీనులే. జగదీశ్వరుండగు శ్రీకృష్ణునికిఁ బ్రియశిష్యుండగు పార్థుండే సామర్థ్యంబు చాలనివాఁడై యుండ, నస్మదాదుల మాటఁజెప్పనేల? చర్మచక్షువుల మయిన మనకు విశ్వరూపంబును దర్శించు భాగ్యంబు పట్టనేపట్టదు—అర్జునునకు దివ్య చక్షువు ప్రసాదింపఁబడి యుండుటచేతనేగదా యాతఁడు విశ్వరూపంబును జూడఁ గల్గెను. మఱియు, నెట్లో దివ్యనేత్రంబును సంపాదించి విశ్వరూపంబును దిలకించుట సంభవించినను మనకుఁ దద్దర్శన

సుఖంబును జిరకాలమనుభవించుట కష్టము. బాలకుఁడు మధ్యాహ్న మార్తాండుని ప్రచండ తేజంబును సహింపఁజాలఁడు. అర్జునుండు విశ్వరూప ప్రభావంబునకుఁ దాళనేరక, తద్రూపంబును జాలించుటకును మఱల బరిచితమాయిన సౌమ్యరూపంబు నందుటకును గృష్ణునిఁ బ్రార్థింపవలసినవాఁ డయ్యెనుగదా. మనశూరాగ్రేసరుని దశ విలోకింపుఁడు (భ. గీత అ 11 )—

"సగద్గదంభీతభీతః" "ప్రసీదదేవేశ"

దివ్యనేత్రమయినను వీని కెట్లు సంప్రాప్తమయినదిఁ భగవంతుఁడగు శ్రీకృష్ణుని మానుషాకారమును భక్తితో సేవించుటవలనఁ బార్థుండు భగవదనుగ్రహమునకుఁ బాత్రుండై దివ్య చక్షువును సంపాదించెను. కావున, నర్జునుండు మొదటఁ బరిచ్ఛిన్నమైన విగ్రహంబునే యారాధించి యున్నవాఁడు. ఒక్క స్వల్పమయిన ప్రతిమనయినను ధరింపఁజాలని యొకని చిత్తమీవిశ్వంబు సర్వంబును భరింపఁగలదా? మల్లవిద్య నభ్యసించువారు మొదటఁ దేలికైన ముద్గరంబును స్వీకరించి, క్రమముగా నెక్కువ బలువుగల ముద్గరంబుల నెత్తుచుఁ ద్రిప్పుచుం

దురు. లఘువు తరువాత గురువు, దానిపిమ్మట గురుతరము—ఇట్లు, లఘుతరానంతరము గురుతరము.

మఱియు, విశ్వరూప మనంతమైనది. అర్జునుఁడు "అనంత" అనియు, "అనంతబాహో" అనియు, విశ్వరూపునిఁ బిలిచి యున్నాఁడు. అనంతమయిన వస్తువును గ్రహించుట యెంతకష్టము! మిక్కిలి చిన్నదియగు పదార్థము నెఱుంగుట సులభము కాదు—ఉదాహరణము, పరమాణువు. మిక్కిలి పెద్దదైన దానిని గ్రహించుటయును సులభమైనదికాదు—ఉదాహరణము, విశ్వరూపము. ప్రాకృతమానవునకుఁ బరమాణువు సాకల్యంబుగా నప్రత్యక్షంబు, విశ్వరూపంబు కొంత గోచరించుటలేదు. ఘటాది వస్తువులు కొన్ని తెలియఁబడుచున్నవి గాన నేకదేశ గ్రహణంబు లోక వ్యవహారంబునఁ జూపట్టుచున్నది. కాని, యది సర్వవస్తుగ్రహణంబుకానేరదు, కావున, విశ్వరూపోపాసనంబు లోకులందఱికిని సాధ్యమగునదికాదు, కొందఱికిమాత్రమే తగియున్నది. అంతముగల ప్రతిమ నర్చించుట యనంతము

యిన విశ్వరూపంబు నుపాసించుటకంటె సుక రంబు కాదా?

మఱియు, నాకారముఁ గల్గిన విశ్వరూ పునియుపాసనమే యింత దుర్లభమయియుండ, నిఁక నిరాకారమయిన బ్రహ్మంబు నుపాసించు ట యెంత దుర్లభమయి యుండునో యూ హింపుఁడు.

పాషాణ విగ్రహాదులను విసర్జించివిశ్వం బు నవలంబించినచో, విగ్రహ బాధ తప్పిపోవు నని కొందఱు భ్రమపడుచున్నారు. కాని, విశ్వ మే విగ్రహము. పాషాణవిగ్రహము చిన్నది, విశ్వవిగ్రహము పెద్దది—భేదమంతియ. విగ్ర హశబ్దము జగత్తున కెట్లు వర్తించుచున్నన, రూపా దులఁ గలిగియుండుటచేతనని యెఱుంగునది. పా షాణ ప్రతిమకును రూపాదులున్నవి, జగత్తున కును నవిగలవు. రూపము పోయినదా? పాశ్చా త్త్యులలోఁ బ్రసిద్ధిఁజెందిన 'కార్లైల్'(Carlyle) అనువాఁడు కూడ జగత్తునకుఁబ్రతిమాత్వమును గ్రహించియున్నాఁడు, మానవదేహమే భగవం తునికిఁ బ్రతిమయని చెప్పియున్నాఁడు, ఎట్ల —

"The Universe is but one vast symbol of God. What is man himself but a symbol of God?

(ఈలోకమంతయు నీశ్వరునకు విశాలమయిన యొక ప్రతిమయై యొప్పుచున్నది. మానవుఁడు సైతము భగవంతునికి నొక ప్రతిమయయి యున్నాఁడు.)

కావున విశ్వరూపోపాసనంబును విగ్రహారాధనంబ.

## అవతారములు.

కొందఱవతారముల కపార్థముం గల్పించుచున్నారు. సామాన్య మానవులకంటె నొక్కింత సామర్థ్యముగల వారలవతార పురుషులుగాఁ బరిగణింపఁబడిరనియు రామకృష్ణాదులు నట్టివారే యనియు వీరివాదము.

(1) సంసార కూపమునఁబడి కొట్టుకొనుచున్న వారిలో నెవ్వఁడేని శక్తినధికముగాఁజూపి తాను పైకి లేచివచ్చుటయేగాక యితరులఁ గూడ లేపనెత్తిన పక్షమున, నట్టివాని కవతారపదము చెల్లదు. సృష్టియందభివృద్ధి క్రమము

(Natural course of evolution)న విజృంభిం
చినవాఁడు ఘనతముఁడయినను రామకృష్ణాదు
లతో సముఁడు కానేరఁడు. సంసార కూపపతి
తులఁజూచి దయార్ద్రహృదయుఁడై తాను లో
నికి దుమికి వారి నుద్ధరించునట్టి భగవంతునకే
యవతారశబ్దము వర్తించుచున్నది. ఇది క్రింద
నుండి పైకిలేచుట (ascent) ను సూచించునది
కాదు; పై నుండి క్రిందికి దిగుట (descent) ను
సూచించును. అవతారమను శబ్దమే యీయర్థ
మును స్ఫురింపఁ జేయుచున్నది. అట్లవతరించు
వారు సామాన్యమానవులు కానేరరు; ఏలయన
వీరింతకుఁ బూర్వమే కూపమునఁ గ్లేశము నందు
చున్నారు.

(2) ముక్తులు మరల జన్మము నందుట
యవతరించుట యందురేని, వీరియందీశ్వరత్వ
ము రూఢముకాదు, జగన్నిర్మాణాది సామర్థ్యం
బును సంపూర్ణంబుగాదు, గావున వీరిజన్మమీ
శ్వరావతారము కాఁజాలదు. భగవంతుఁడు
జన్మము నందినప్పుడు మాత్రమే భగవదవతా
రమని గ్రహింపవలయును.

(3) ఆతనికి జన్మమున్నదోయను శంకకు

'పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దు ష్కృతాం ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే'' అను గీతావాక్యము సమాధానము.

(4) జన్మవలన సంసారిత్వ ప్రసంగము కాదా యను శంకకు 'ఆత్మమాయయా' అనునట్లు మాయను దనవశమందుంచుకొనుటయే సమాధానము: సామాన్యులు మాయకు లోఁబడుదురు; మాయ భగవంతునకు లోఁబడును. కాన నీశ్వరునకు జన్మచే నష్టము లేదు.

(5) మఱియు సామాన్యులజన్మకుఁ గర్మ కారణము. పరమేశ్వరుని పుట్టువునకది కాదు. లోకానుగ్రహబుద్ధియే కారణంబు. మనలో ఘనులయిన వారవతార పదవాచ్యులనుట సాహసము.

(6) అవాప్త సర్వకాముఁడైన భగవంతుఁ డవతరించుటకుఁ బ్రయోజనమేమని ప్రశ్నించిన యెడల, సాధుపరిత్రాణాది మూలముగా ధర్మసంస్థాపనమని ప్రత్యుత్తరము! కాని మనజన్మలు కర్మఫలంబుననుభవించుటకొఱకు. అస్మదాదులును రామాదులును జేయునట్టి పను

లు విలక్షణములు. అందువలన మనకును బర మేశ్వరునికిని వ్యాపారమునందును భేదమున్నది. ఇట్లు, రెండుజన్మలునొక్కవిధమైనవికానందున సర్వేశ్వరుని పుట్టువు మాత్రమే యవతారము.

(7) దానాదులందు వీరులైనవారిని వీరులను (heroes) గాఁ బరిగణింతుముగాక. కర్ణుఁడు దానవీరుఁడైనను నవతారపురుషుఁడు కాఁడుగదా. కార్లైల్ నెపోలియన్ బోనాపార్టు మున్నగువారిని ‘Heroes and Hero-Worship’ అను గ్రంథమున వర్ణించియున్నాఁడు. వీరిలో నొక్కఁడును నవతారసంకేతమునకుఁ దగఁడు. ఆధిక్యమున్నమాత్రమున నవతారమందుమేని, రావణుఁడు, హిరణ్యాక్షుఁడు మొదలుగాఁగల రాక్షసవీరు లవతారపదమునకు యోగ్యులు కావలసివచ్చును. మానవులు చేయఁజాలని కృత్యములఁ బిశాచాదులు నిర్వహించుటకలదు. కాఁబట్టి పిశాచాదుల నవతారము లనవలసి వచ్చును. కాని యిది హాస్యాస్పదము గనుక నాధిక్యము మాత్రమే యవతారమును వ్యక్తము సేయనోపదు.

(8) మఱియు, సాధిక్యమునకు నవధి (limit) లేనికతమున నవతారానన్త్యము సంభవించును. లోకములో నొకనికంటె మఱియొకఁడు విద్యయందుగాని ధనమందుగాని బలమందుగాని యధికుఁడగుట గలదు గనుక వీరందఱును నవతారకోటిఁ బ్రవేశింపఁ దగినవారగుదురు. కాని యిదిపొసఁగదు. కాబట్టి విద్యాదులందలి యాధిక్యముచే నవతారము నిర్ధారింప నెంచుట తప్పు. ఆస్తికులు నాస్తికుల మాటలు నమ్మి రామ కృష్ణాదులను మనుష్య మాత్రులనుగాఁ జూడక వారియందు భగవదవతారబుద్ధిని వృద్ధి నొందించి కృతార్థులగుదురుగాక.

ఇట్లు, పరమేశ్వరునకు రామకృష్ణాది శరీరములు సిద్ధించుచున్నవి గాను బ్రతిమార్చనంబు సమంజసంబ యగును.

## రామాది దేవత్వము.

పూర్వపక్షము:—రామాయణము యొక్క యుద్ధకాండమునందలి 117 వసర్గలో

శ్లో॥ 'ఆత్మానం మానుషంమన్యే రామం దశరథాత్మజం।
సోహంయశ్చయతశ్చాహం భగవాంస్తద్బ్రవీతు మే॥'

(నన్ను దశరథుని పుత్త్రునిఁగాను, రాముఁడను పేరుగలవానిఁగాను, మనుష్యులలో నొక్కనిఁగాను భావించుచున్నాను. అట్టి నేను నిజముగా నెట్టివాఁడనో యెందుండి వచ్చితినో యావిషయమును నాకు భగవంతుఁడవగు నీవు తెలియఁజేయుదువుగాక.)

అని శ్రీరాముఁడు బ్రహ్మతోఁ జెప్పెను. ఇట్లు శ్రీరాముఁడు తాను భగవంతుఁడను గానని యు మనుష్యుఁడనగుచున్నాననియు స్వయముగానే ఘోషించుచుండ నాతని భగవంతునిఁగా గ్రహించుట యసంగతముకాదా? కావున నతఁడు పరమేశ్వరుఁడు కానేరఁడు.

సిద్ధాంతము—కాదు, ఏలయన, (1) శ్రీరాముఁడు వినయధర్మమును లోకమునకు బోధించుటనిమిత్తమే యావాక్యముం బల్కెను, కించిజ్జ్ఞత్వముచేఁగాదు.

"సర్వజ్ఞస్యాపి శ్రీరామస్యమహాదేవబ్రహ్మేంద్రాదిదేవానాం సన్నిధౌ 'ఆత్మానంమానుషంమన్యే' ఇత్యాదివచనేన 'దేవానాం సన్నిధౌ మనుష్యేణ వినయఏవ కర్తవ్యః, నతుప్రాగల్భ్యం కర్తవ్యం, తథాసతి మనుష్యస్యానర్థో భవేత్', ఇతియాపరమేశ్వరకృతా మర్యాదా, సా శ్రీరామేణ పరిపాలితా"

(వాస్తవముగా సర్వజ్ఞత్వాది లక్షణోపేతుఁ డగు పరమేశ్వరుఁడైనను శ్రీరాముఁడు రుద్ర బ్రహ్మేంద్రాది దేవతలయెదుట 'నేను మను ష్యమాత్రుఁడను' అని పల్కినమాట సత్యము. కాని, యట్లు పలుకుటచే, దేవతల సన్నిధిని మానవుఁడు వినయము నవలంబింపవలయును: విఱ్ఱవీగుట తగదు; విఱ్ఱవీగెనేని, నుపద్రవము వాటిల్లితీరును' అని తనచే నేర్పాటుచేయఁ బడెనో యది శ్రీరామునిచేఁ బరిపాలింపఁబడిన దాయెను.)

అని సిద్ధాంతలేశసంగ్రహవ్యాఖ్యానము.

2. మఱియు, నీవాక్యముచే శ్రీరాముఁ డు బ్రహ్మవిద్యోపదేశ సంప్రదాయమును బ్రద ర్శించెను, 'తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సే వయా' అను గీతావాక్యము చెప్పినరీతిగా బ్ర హ్మవిద్య సద్గురువులనుండి గ్రహింపవలయునని యిందువలన సూచింపఁబడినది.

"ఏవమన్యా అపిమనుష్యాణాం హితార్థాయ గురుశిష్యసం ప్రదాయాదిలక్షణాః పర్యాదాః పరమేశ్వరేణకృతాః, తాస్సర్వా అపితదాతదా శ్రీరామకృష్ణాద్యైర్లోకహితా ర్థాయానుష్ఠితాః"

(ఇట్లే గురుశిష్య సంప్రదాయాది రూపములైన మఱికొన్ని మర్యాదలు కూడ లోకహితము కొఱకు పరమేశ్వరునిచే నేర్పాటు చేయఁబడి యున్నవిగదా. అవన్నియును రామకృష్ణాదులచే నప్పు డప్పుడు లోకానుగ్రహార్థ మనుష్ఠింపఁ బడినవి.)

అని సిద్ధాంతలేశసంగ్రహ వ్యాఖ్య.

"అథబ్రహ్మనుగ్రహో దేవబ్రహ్మవిద్యాన్మ్యఖ్యస్య శ్రుత్యాదిసిద్ధతయా, తద్యాన్మ్యఖ్యస్య 'ఆత్మానం నావబుధ్యసే' ఇతి బ్రహ్మణైవకృతత్వాత్, తజ్జిజ్ఞాసుతివస్యోయానాంస్వస్వరూపబోధనాయ బ్రహ్మాణం, గురుమజ్ఞ ఇవ, ఉపాసదహాదిత్యా"

(బ్రహ్మనుగ్రహమువలన బ్రహ్మవిద్యయందాసక్తి పొడమునని శ్రుత్యాదులందుఁ జెప్పఁబడినది. నిన్ను నీవెఱుఁగవాయని బ్రహ్మ యట్టియాసక్తిని శ్రీరాములందుఁ గలుగఁజేసెను. అందువలన నిజముగా నాత్మను దెలిసికొనఁ గోరువాని భంగి, నజ్ఞాని గురువునడిగినట్లు, రాముఁడు బ్రహ్మనడిగెను.)

అని తిలకమను రామాయణ వ్యాఖ్యానము.

౧౩. మఱియు, శ్రీరాముఁడు తాను భగవదవతారమని స్వయముగాఁ జెల్పుటకంటె బ్రహ్మాదులచేఁ బల్కించినచో లోకులకా విషయమందెక్కుడు విశ్వాసముదయించును గాన నట్లుజేసెను. బ్రహ్మాదిదేవత లొక్కసారి వచ్చి శ్రీరాముని నిజస్వరూపమును బ్రకటించుటవలన నింక దనవారి కెవ్వరికిని దనవిషయమున సందేహము కలుగనేరదని భావించి శ్రీరాముఁడు కించిజ్జ్ఞత్వాదికము నభినయించెను. కాఁబట్టియే-

'తజ్జిజ్ఞాసురివస్వీయానాం స్వస్వరూప బోధనాయ'

(రాముఁడు తనతత్త్వమును నెఱింగినవాఁడయ్యుఁ, దనవారికిఁ దనవాస్తవమయిన స్వరూపమును దెలియఁజేయఁదలఁచి, తన్నుఁదాను నిజముగాఁ దెలిసికొనఁ గోరినవానివగిదిఁ దన విషయమై బ్రహ్మదేవునడిగెను).

అని తిలకము. ఇట 'ఇవ' (వలె) అను నదిపరికింపుఁడు.

ఈ హేతువులచే శ్రీరాముఁడు మనుష్యమాత్రుఁడు కానేరఁడు.

## అజ్ఞత్వాద్యభినయము

పూర్వపక్షము— శ్రీరాముఁడు సీతావియోగాదులందు దుఃఖాదులొందెనని రామాయణాదులందున్నది. మనుష్యలక్షణము లాతనియందున్నవి. భగవల్లక్షణములైన సర్వశక్తిమత్త్వాదు లాతనియందుఁగన్పట్టవు. కాఁబట్టిచర్యను బట్టివిచారించిననునాతఁడు భగవంతుఁడుకాఁడు.

సిద్ధాంతము— కాదు. (1) ఏలయనఁ నాతని చర్య తన యుద్దేశము ననుసరించియే యున్నది; అది నటన.

"నచపరమేశ్వరస్య రఘునాథాద్యవతారే తమస్విత్వదుఃఖ సంసర్గాది శ్రవణాన్ముక్తానా మీశ్వరభావే పునర్బంధాపత్తిః. తస్యవిప్రశాపామోఘత్వాదిస్వకృతమర్యాదా పరిపాలనాయకథంచి ద్భృగుశాపాది సత్యత్వం ప్రఖ్యాపయితుం నటవదీశ్వరస్య తదభినయ మాత్రపరత్వాత్"

(పరమేశ్వరునకు శ్రీరామాద్యవతారమున నజ్ఞత్వదుఃఖత్వాదులు రామాయణాదులందు వర్ణింపఁబడి యున్నందున ముక్తుల కీశ్వరత్వము ప్రాప్తించినను దుఃఖాదులతోఁ గూడిన బంధము మరల సిద్ధము కాఁగలదని తలంపవలదు.

ఏలయన, '(బ్రాహ్మణ శాపము తప్పనదికాదు' మొదలగు స్వకృత వ్యవస్థలను నిల్పుటకొఱకు, భృగుశాపాదు లీశ్వరుఁడైన తనకే తగిలినవి యిఁక మానవులమాటఁ జెప్పనేల యని లోకమునకు నమ్మకముఁ గల్గింపనెంచి, నాటకరంగమున నొకఁడు మఱియొకని వేషముఁదాల్చి యాతని చర్యను బ్రదర్శించునటులనే యీశ్వరుఁడు శాపాద్యనుభవము నభినయించి సీతావియోగ దుఃఖాదులను నటించెనని తెల్పుటకే రామవిషాదాది వర్ణన లుద్దేశింపఁబడినవి)

అని సిద్ధాంతలేశసంగ్రహము (అ.4)న వ్రాయఁబడియున్నది.

ఇట్లే సంక్షేప శారీరకము (అ. 2. శ్లో. 182) న నిర్ణయింపఁబడియున్నది:—

శ్లో. "సంకల్ప పూర్వకమభూద్రఘునందనస్య
'నాహంవిజానే' ఇతి కించన కాలమేతత్ ।
బ్రహ్మోపదేశ ముపలభ్య నిమిత్తమాత్రం
తచ్చోప్యసర్జనస కృతే సతి దేవకార్యే ॥"

(నేనెఱుంగనని పల్కుట మొదలుగాఁగల చర్య యంతయును శ్రీరామునికి స్వేచ్ఛాపూర్వకం బయినది. అదియును స్వల్పకాలమువఱకే యుం

డెను. మఱియు, దేవాదిహితార్థము స్వీకరింపఁబడిన రావణవధాదికార్యంబు నిర్వహింపఁబడిన తరువాత, బ్రహ్మవలన నుపదేశంబును నిమిత్తమాత్రింబుగాఁ బరిగ్రహించి, తదజ్ఞత్వాద్యభినయంబును రాముండు విసర్జించెను.)

తచ్చోత్పన్నసకలేతత్త్వజ్ఞానవిసర్జనే స్వాతంత్ర్యందర్శయన్, ప్రాకృతస్య ఇవ అజ్ఞతానటనమేవ ఇతి దర్శితం'

(పై శ్లోకమున నజ్ఞత్వాదికము రాముని విడిచెనని లేదు, రాముఁడే యజ్ఞత్వాదికమును విడిచెనని నుడువఁబడినది. అందువలన నజ్ఞత్వాది విసర్జనమందు రామునికిఁగల స్వాతంత్ర్యము వ్యక్తమగుచున్నది. సామాన్య మానవులట్లు గాదు. వారజ్ఞత్వాదికమును విడిచిపెట్టఁగోరినను, నది వారిని విడిచిపెట్టదుగదా. కాన వీరజ్ఞానాది పరతంత్రులు; పరతంత్రులు గాన వారిది నటన కానేరదు. ఇట్టి భేదము గలదు గాన శ్రీరాముఁడు ప్రాకృత మానవులవలె నభినయించెనేగాని వాస్తవముగా నజ్ఞతాదులు గలిగి యుండలేదని ద్యోతించుచున్నది)

అని మధుసూదన సరస్వతి యొక్క వ్యాఖ్య. మఱియు, 'నిమిత్తమాత్రం' అనుట

వలన 'నిమిత్తమాత్రం భవసవ్యసాచిన్' అను న్యాయముచొప్పున, బ్రహ్మ యుపదేశించినను నుపదేశింపకుండినను గూడ శ్రీరాముడు సర్వజ్ఞు డేయని ద్యోతించుచున్నది.

ఇప్పుడు మధుసూదన సరస్వతియొక్క మాటలతోడనే పూర్వపక్ష సిద్ధాంతములను బ్రదర్శించెదను. ఎట్లన,

పూర్వపక్షము—

'నన్వేవం సతి రఘునాథాదేః కథమజ్ఞత్వాదిపురాణప్రసిద్ధ ముపప?

(శ్రీ)రామాదు లీశ్వరావతారులైనచో, వారి కజ్ఞానాదు లుండకపోవలెను. కాని పురాణము లందు వారి కజ్ఞానాదులుండెడివని వర్ణింపబడి యున్నది. కాన వారీశ్వరాదులు కానేరరు. లేదా, పురాణము లబద్ధములు కావలెను.)

సిద్ధాంతము—

"తస్మిన్నేవపురాణేతస్య నిరవగ్రహైశ్వర్యశ్రవణాత్తస్య సర్వజ్ఞత్వేఽపి, స్వీకృత మనుష్యనటనాం ప్రదర్శయితుం విషయిణాం గతించ స్వేచ్ఛయైవాహంకించిత్కాలం నవిజాన ఇతి సంకల్పపూర్వక మజ్ఞత్వాభినయః సీతాపహారాది నిమిత్తశోకాది ప్రకటనం చేత్యాశయేనాహ సంకల్పేతి"

(పురాణమున వక్కాణింపఁబడియున్నందున నజ్ఞత్వాదికమును స్వీకరింతువేని, నేతత్పురాణమునందే శ్రీరాముఁడు సర్వజ్ఞత్వాది లక్షణసమన్వితుఁడగు నీశ్వరుఁడని నిర్ణయింపఁబడియున్నందున నాతఁడీశ్వరుఁడేయని గ్రహింపుము. కానిచో, నీశ్వరాభిధాయక పురాణవాక్యముల కప్రామాణ్యము ప్రాప్తించును. అట్లయినచో సర్వజ్ఞత్వాద్యసర్వజ్ఞత్వాది వాక్యసమన్వయమెట్లన, రావణ వధాది నిర్వాహమునకొఱకు మానవదేహముఁ దాల్చెను గాన మానవ జీవితము ననుకరించుటకును కొన్నావిషయముల గతి నొల్లఁబడునో జూపుటకును నేను కొంతకాలమువఱకు నిజస్వరూపమును మఱుఁగుపఱిచి సంసారివలెఁ గించిజ్జత్వమునే ప్రదర్శించెదనుగాక యని తాను స్వయముగా నిశ్చయించుకొని యజ్ఞత్వాదులను స్వేచ్ఛగా నభినయించెననియు సీతాపహారాదులవలన దుఃఖాది వికారములు గనఁబఱచెననియు నీ శ్లోకమునందలి మొదటి రెండుపాదముల యభిప్రాయము.)

పూర్వపక్షము—

"నన్వేవంసతి తస్య బ్రహ్మోపదేశాద్యనర్థకం,
నహిసర్వజ్ఞే ఉపదేశో౽ర్థవాన్ నిత్యాకాంక్ష్య"

(సర్వజ్ఞుఁడైన చో బ్రహ్మోపదేశమేల గావల సివచ్చినది? కాని, బ్రహ్మోపదేశమపేక్షించెను గాన రాముఁడు మనుష్యమాత్రుఁడు. మనుష్య మాత్రుఁడుగాఁడని స్వీకరింతుమేని, నిష్ప్రయోజనముగా నుపదేశముం గాంక్షించె ననవలసి వచ్చును.)

సిద్ధాంతము—

"సోపి తస్య స్వేచ్ఛా స్వీకృతమనుష్యవ్యాపార,
ఇత్యాశయే నాహ బ్రహ్మేతి"

(మానవుఁడు గురువునొద్ద నుపదేశమును గ్రహించునట్లే రాముఁడును బ్రహ్మయొద్ద నుపదేశమును గ్రహింప సంకల్పించుకొనెను. అభినయముద్దేశింపఁబడినది గాన రాముని యుపదేశ స్వీకారము నిరర్థకము గాఁజాలదు.)

ప్రశ్న—అభినయమాత్రమని యంగీకరింపమేని, నష్టమేమి?

ఉత్తరము—

"అన్యథా, తస్య నిత్యనంక్తత్వ నిరవగ్రహ స్వాతంత్ర్య సమాభ్యధిక రాహిత్యాది శ్రుతి విరోధాత్"

(అభినయమాత్రమేయని యంగీకరింపని పక్ష మున, సాతఁడు నిత్యముక్తుఁడు నిరవగ్రహ స్వాతంత్ర్యముగలవాఁడు, తనతో సముఁడుగాని తనకంటె నధికుఁడుగాని లేనివాఁడు- ఇవి మొద లుగాఁగల శ్రుతివాక్యములకు విరోధము సంభ వించును. కాని, శ్రుతి స్మృతులకు విరోధము కనఁబడినప్పుడు స్మృతికంటె శ్రుతి బలీయమను న్యాయమున ననుసరించి, శ్రీరాముఁడు సర్వజ్ఞత్వా దీశ్వరధర్మములతో నొప్పెనను శ్రుతివాక్యము లు ప్రమాణమనియుఁ, గించిజ్జ్ఞత్వాది మానవ ధర్మములతో నుండెనని తెల్పిన పురాణవాక్య ము లుపేక్షణీయములనియుఁ బురాణవాక్యము లకును శ్రుతివాక్యములకును నిజముగా విరో ధము కలదని తలఁచువా రంగీకరింప వలసియు న్నది. విరోధమే లేదనువారు శ్రీరాముని చరి త్రము నభినయ పరముగా గ్రహింపక తీరదు. మఱియొక మార్గము లేదు.)

అని సిద్ధాంత లేశసంగ్రహము. శ్రుతు లందు మాత్రమే కాదు, రామాయణాదు లందుఁ గూడ శ్రీరాముఁడు పరమేశ్వరుఁడని పలుతా వుల నిరూపింపఁబడి యున్నది.

కాఁబట్టియే,

"అహర్నిశం బ్రహ్మేశాది స్తుత్యత్వ దేవదేవత్వాది ప్రతిపాదక రామాయణవచనైరేవ శ్రీమహావిష్ణోర్లోకహితార్థాయ శ్రీరామరూపేణావతీర్ణస్య క్షమస్విత్యాది శ్రవణమభినయమాత్ర పరమితి భావః"

(అహర్నిశము బ్రహ్మేశాదిస్తుత్యత్వ దేవదేవత్వాదులను బోధించు రామాయణ వచనముల చేతనే లోకానుగ్రహార్థము శ్రీరామరూపమున నవతరించిన శ్రీ మహావిష్ణువునకు నజ్ఞానాదులుండెడివనుమాట నటనమాత్రమే దెల్పుట కుద్దేశింపఁబడినది, నిజముగా నజ్ఞానాదు లుండెనని దెల్పుటకుఁగాదు.)

అని విస్పష్టముగా సిద్ధాంతలేశ సంగ్రహవ్యాఖ్యానమునఁ దెలుపఁబడినది. శ్రీకృష్ణాద్యవతారముల తత్త్వము నీరీతినే గ్రహింపవలయును.

ఆంధ్రభాగవతము (స్కంధము 10) నుండి యొక పద్యముతో నీ వ్యాసము ముగించుచున్నాఁడ.

ఉ. "పుట్టువు లేని నీకు భవ। పుష్టికి క్రీడయె కాక పుట్టుటే
పుట్టువు మాకు భవాదికర్మ। లెల్లను జీవముక్తందవిద్యదా

బుట్టుచున్నందుఁ గానినినుఁ బుట్టవదింబలేఁబొందసుంద్రియుం
బట్టఁగ శేశ్వత్రిక్రియలఁ జొక్కనియొక్కటివాదుఫ్లీశ్వరా!"॥

(అవతరించుట పరమేశ్వరుని కిందఱిజాల విద్య వలె వినోదమేయనియు మాయా కార్యము లాతనికిఁ దగులఁజాలవనియు భావము.)

### త్రిమూర్తులు.

కొందఱింద్రాది దేవతలకును బరబ్రహ్మంబునకును భేదము లేకపోయినను బ్రహ్మ విష్ణు రుద్రులకు ముగ్గురికిఁ బరస్పర వస్తు భేద మున్నదని వాదింతురు. కాని, యిది తగదు. ఏలయన, శ్రీమద్భాగవత దశమస్కంధములోని మూఁడవ యధ్యాయమందలి 20 వ శ్లోకమున వసుదేవుండు శ్రీకృష్ణ పరమాత్మ నిట్లు స్తుతించియున్నాఁడు—

శ్లో. "సత్వంత్రిలోకస్థితయేస్వమాయయా।
భిభర్షి శుక్లంఖలువర్ణమాత్మనః।
సర్గాయరక్తంరజసోపబృంహితం।
కృష్ణంచవర్ణంతమసాజనాత్యయే॥"

(అట్టి పరబ్రహ్మస్వరూపుండవగు నీవు త్రిలోకముల సంరక్షించుకొఱకు సత్వగుణప్రధానం

బగు తెలుపువర్ణమును; జగత్తుల సృష్టించుటకై రజోగుణముచే బ్రచురింపఁబడిన యెఱుపువర్ణమును; లోక ప్రళయము నిమిత్తము తమోగుణముచేత నలుపువన్నెను; స్వమాయాబలంబున ధరింతువు.)

ఇట్లు తెలుపువన్నెను ధరించినపరమేశ్వరుని విష్ణువందురు. ఎఱుపువన్నె ధరించినయాయీశ్వరునే బ్రహ్మయనిచెప్పుదురు. నలుపువన్నె ధరించినప్పుడు రుద్రుఁడందురు. అనఁగా, నొక భగవంతుఁడే భిన్నమూర్తుల, లేక, వేషములఁదాల్చి సృష్టిస్థితి లయాదులఁ జేయుచు బ్రహ్మ విష్ణు మహేశ్వరులని వరుసగాఁ బిలువఁబడుచున్నాఁడు. కాఁబట్టి త్రిమూర్తులకు వస్తు భేదము లేదు. వేషములు భిన్నంబులైన మాత్రానఁ బురుషులు కూడ భిన్నులనుట యుక్తమా? కానేరదు.

కాళిదాస కృతమయిన రఘువంశ కావ్యమున విష్ణుఁడిటుల స్తుతింపఁబడియె. (సర్గ. 10. శ్లో. 16.):—

శ్లో. ॥నమోవిశ్వసృజే పూర్వంవిశ్వం తదనుబిభ్రతే।
అథవిశ్వస్య సంహర్త్రే తుభ్యంత్రేధాస్థితాత్మనే

(మొదట విశ్వమును సృజించునట్టియుఁ, బిమ్మట విశ్వమును బోషించు నట్టియు, నటుపిమ్మట విశ్వమునకు సంహార మొనరించు నట్టియు, నిట్లు సృష్టిస్థితి సంహారకర్తృత్వముచేత మూఁడు తెఱంగులఁ జెలంగుచున్న స్వరూపముగల నీకు నమస్కారము.)

మల్లినాథుని టీక—

"తస్మైబ్రహ్మవిష్ణుహరాత్మనేతుభ్యంనమః"

(బ్రహ్మ విష్ణు శివాత్మకుఁడవైన నీకొఱకు నమస్కారము.)

మఱియు నీకవి తన కుమారసంభవమున నిట్లు వర్ణించియున్నాఁడు (సర్గ. 2. శ్లో. 4)—

శ్లో. "నమస్త్రిమూర్తయేతుభ్యం ప్రాక్సృష్టేః కేవలాత్మనే।
గుణత్రయవిభాగాయ పశ్చాద్భేదముపేయుషే॥"

(శ్రీభగవంతుఁడా! సృష్టికిఁ బూర్వమేకరూపుఁడై నట్టియుఁ, బిమ్మట సృష్టిప్రవృత్తికాలమందు సత్త్వాది గుణత్రయముచే విభజింపఁబడినట్టియు; సత్త్వాది భేదమునందునట్టియు, నందువలన బ్రహ్మ విష్ణు రుద్రరూపుఁడ వయినట్టియు నీకొఱకు నమస్కారము)

మఱియు, 6 వ శ్లోకమును గనుఁడు—

శ్లో. "త్రిసృభిస్త్వమవస్థాభిర్మహిమానముదీరయన్ ।
ప్రళయస్థితిసర్గాణామేకః కారణతాం గతః॥"

(సృష్టికిఁ బూర్వమువఁ గేవలుఁడ వయ్యుఁ ద్రిగుణమయములైన హరిహరబ్రహ్మలను మూఁడవస్థల చేతను స్వశక్తిని విజృంభింపఁజేసి, జగదుత్పత్తిస్థితి సంహారములకుఁ గారణుండవగు చున్నావు.)

మల్లినాథుఁడు "త్రిసృభిరవస్థాభిః" అనుదానికి "త్రైగుణ్యమయీభిః హరిహరబ్రహ్మ స్వరూపాభిః" అని టీకను వ్రాసియున్నాఁడు.

ఈవిషయమే తిక్కనసోమయాజి కృతంబైన నిర్వచనోత్తర రామాయణంబున నీవిధముగా నిరూపింపఁబడినది—

"సత్త్వరజస్తమోగుణవశస్థితిఁ గైకొని లీలనీవ బ్ర
హ్మత్వముఁ దాల్చి లోకములకన్నిటికిం జనకుండ వౌదు వి
ష్ణుత్వముఁ దాల్చి వానికి మనోజ్ఞతరస్థితి వృత్తి సేతు రు
ద్రత్వముఁ దాల్చి వాని కుచితంబుగ సంహృతిఁ జేతు
రాఘవా!"

## రుచిభేదము.

విష్ణ్వాదులందఱు నొక్క యీశ్వరుని
మూర్తులేయైనచో నేకేశ్వరారాధనంబుఁ జేసి
నఁజాలదా యనేక దేవతారాధనంబువలనఁ
బ్రయోజనంబేమని యాక్షేపించిన యెడలఁ,
బ్రయోజనంబు కద్దని సమాధానము. 'లోకో
భిన్నరుచిః' అను న్యాయము చొప్పున జనసము
దాయమందు రుచిభేదము కలదు. కొందఱికి
మధుర రసమందు మక్కువ యెక్కువ. మఱి
కొందఱికిఁ గారమునందు మిక్కిలి కోరిక. సమ
స్త జనులు నొక్కరసమే స్వీకరింపవలెననుట
యెట్లు లాభకరముకాదో, యేకస్వరూపుండైన
యీశ్వరునే సేవింపవలెననుటయు నట్లే. మఱి
యు, షడ్రసములఁగూడ నెట్లు స్వీకరింపవచ్చు
నో, మన్మతము లట్లె స్వీకరింపనగు. అంతే
కాదు, తన దేహతత్త్వమునకు సరిపడని పదా
ర్థముఁ బుచ్చుకొనినప్పుడు తనకు నష్టము కలు
గురీతిఁ దన బుద్ధితత్త్వమున కనుకూలముకాని
భగవద్విగ్రహమును సేవింపఁబోయిన నది సరి
పడక శ్రేయోమార్గ మాటంకపడిపోవును.
ఇట్టి విషయము లాలోచించియే శ్రీశంకరా

చార్యులు, శైవము, వైష్ణవము, గాణాపత్యము, శాక్తేయము మొదలుగాఁగల షణ్మతములను స్థాపించి షణ్మతస్థాపనాచార్యులను బిరుదంబునంది దిగంతవిశ్రాంతకీర్తులైరి. అంతియే కాని, యుదాసీనతన మతసంస్కారులం బోలె నేకేశ్వరారాధనంబు మాత్రమె యుండవలెనని యెంచి తదితర మూర్త్యుపాసనంబుల ధ్వంసంబుఁ జేయ సమకట్టియుండలేదు. శంకరాచార్యులు హరిమీడేస్తోత్రమునం దివ్విధంబున నీశ్వరుని స్తుతించియుండిరి:—

శ్లో॥ "బ్రహ్మావిష్ణూరుద్రహుతాశౌ సూర్యాచంద్రా
విన్ద్రోవాయుర్యజ్ఞ ఇతీత్థం పరికల్ప్య।
ఏకంసంతంయంబహుధాహుర్మతిభేదా
త్తంసంసారధ్వాంతవినాశంహరిమీడే॥"

(యసాధారణముగా నొక్కఁడే యున్నప్పటికి నవ్యక్తిని, బ్రహ్మ, విష్ణువు, రుద్రుఁడు, అగ్నిహోత్రుఁడు, సూర్యుఁడు, చంద్రుఁడు, ఇంద్రుఁడు, వాయుదేవుఁడు, యజ్ఞేశ్వరుఁడు, అనియు నీవిధముగాఁగల్పించిమతభేదమువలనఁ బెక్కుభంగుల విద్వాంసులు పల్కుదురో, యట్టి సంసారాంధకారము నశింపఁజేయు శ్రీహరిని, సేవించుచు

(జగదీశ్వరుండైన శివునియందుఁగాని జగత్తుల కంతరాత్మయైన విష్ణునందుఁగాని వస్తుత్వము విషయమై భేదబుద్ధి నాకెంతమాత్రమును లేదు. ఐనప్పటికి నాకు భజనానురాగము చంద్రావతంసుఁడగు శివునియందే యున్నది.)

లీలాశుకుండు శైవసంప్రదాయములోని వాఁడైనను విష్ణుభక్తుఁడై శ్రీకృష్ణకర్ణామృత మను గ్రంథమందు—

శ్లో॥ "శైవా వయం న ఖలు తత్ర విచారణీయం
పఞ్చాక్షరీ జపపరా నితరాం తథాపి
చేతో మదీయ మతసీకుసుమావభాసం
స్మేరాననం స్మరతి గోపవధూకిశోరం॥"

(పంచాక్షరీమంత్ర జపమందాసక్తులమైన మేము శివసంబంధులము. ఆవిషయమందు సంశయమున కవసరము లేదు. ఐనప్పటికి నామనంబు నల్లని యవిసెపువ్వుయొక్క కాంతి వంటి కాంతి గలవాఁడును నగుమొగము గలవాఁడును గోపస్త్రీ పుత్రుఁడునగు శ్రీకృష్ణునే యెంతయు స్మరించుచున్నది.)

ఇష్టదేవతాభక్త్యతిశయముం దెల్పు కథలనేకములు గలవు.